ఓం.

శ్రీ శివాయనమః.

# 1. లింగయజ్ఞోపవీతము.

గ్రంథకర్త

చదువుల కోటయ్య శాస్త్రి. (వీరశైవులు)

పెద్దాపురం.

# 2. మహాలింగలీల.

# 3. లింగమణిమాలిక.

గ్రంథకర్త

వీరశైవులగు శివశ్రీ పిలువుగారి వీరబసవగురుని శిష్యుడు

చదువుల బసవశంకరయ్య,

పెద్దాపురం.

... ఏలూరు కాపురస్తులు, చాటాత్రి

...సెమ్మగార్ల యొక్కయు ధనసహాయమున

...చురింపబడి

... ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

...ప్రతులు 1000.

1930.

శ్రీ శివాయనమః.

# 1. లింగయజ్ఞోపవీతము.

గ్రంథకర్త

చదువుల కోటయ్య శాస్త్రి, (వీరశైవులు)

పెద్దాపురం.

# 2. మహాలింగలీల.

# 3. లింగమణిమాలిక.

గ్రంథకర్త

వీరశైవులగు శివశ్రీ చిలువూరి వీరబసవగురుని శిష్యుడు

చదువుల బసవశంకరయ్య,

పెద్దాపురం.

గ్రంథకర్తలయొక్కయు, ఏలూరు కాపురస్థులు, చాట్రాతి

శివమ్మ, లక్ష్మీనరసమ్మగార్ల యొక్కయు ధనసహాయమున

ప్రచురింపబడి

ఏలూరు శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను.

ప్రతులు 1000.

1930.

# మనవి



మహాశయులారా!

లింగయజ్ఞోపవీతము, మహాలింగలీల, లింగమణిమాలిక, అను నీమూడు గ్రంథములు బ్రహ్మవిద్యనుగూర్చి వెల్లడించునవియసి, వేరుగ వచింప నవసరములేదనుసంగతి, పాఠకులే గుర్తింపగలరు.

లింగమే యజ్ఞోపవీతమనియు, లింగధారులకు వేఱే మఱొక యజ్ఞోపవీతమవసరము లేదనియు, లింగమననేమి ? యను ప్రశ్నకు దగు సమాధానమువివరముగా నీలింగయజ్ఞోపవీతమను గ్రంథరాజమునం దుదాహరింపబడెను.

జన్నిదమవసరములేక, శివలింగమునుమాత్రమే ధరించి ప్రవర్తించు వీరశైవులగు లింగాయతులు, పరమవైదిక బ్రాహ్మణులవలెను వీరలిప్రాంతమున బ్రతిగ్రామమున నివసింపక నచ్చటచ్చట స్వల్పసంఖ్యాకులుగా నివసించుటచే వీరిలో చాలవఱకు మతశాస్త్రమును సంపూర్ణముగ జదువుకొనకపోవుటచే తమయున్నతస్థితిగతుల నితరులకు జక్కగ వచ్చజెప్పలేకపోవుటంజేసి "వీరెవరోయని" యితరులవలన నూహింపబడుచున్నారు.

అట్టిలోపము దీర్చుటకయి మాచేశ్రీశివార్పణముగ రచింపబడిన నీగ్రంథరాజముల జక్కగావిని; మహాలింగమూర్తినిం గన్న యానందమున, గ్రంథముద్రణమునకు ధనసహాయమొనర్చినవారును ఏలూరు పురవాసులును, కౌండిన్యసగోత్రులును, నియోగులునునగు, చాట్రాతి శేషమ్మ లక్ష్మీనర్సమ్మగార్లనున్నూ. యీగ్రంథముద్రణమునకు, ననున్ బ్రోత్సహించినవారును వైశ్యులునునగు, పేర్లసావిత్రమ్మగారినిని శ్రీనర్వేశ్వరుడురక్షించుగాక.

పెద్దాపురం
3—4—30

ఇట్లు,
... సవశంకరయ్య



# పీఠిక



శ్రీ పరమేశ్వరునిచే నిర్మింపబడిన ప్రపంచములోని యెనుబది నాలుగులక్షల జీవరాసులలో మానవజన్మముత్తమము.

శ్లో॥ విశుద్ధాః ప్రాకృతాశ్చేతి ద్వివిధా మానుషాస్మృతాః
శివసంస్కారిణశ్శుద్ధాః ప్రాకృతా ఇతరేమతాః॥

అను సుప్రభేదాగమవచనము ననుసరించి యీమానవులు విశుద్ధులనియు, ప్రాకృతులనియు ద్వివిధము. బ్రహ్మమగుశివతత్త్వవిచారపరులు విశుద్ధులనియు ప్రకృతివిచారణపరులు ప్రాకృతులనియు పేరు. ఈ సర్వవిషయములను దెలుపుటకు వేదములు ముఖ్యప్రమాణములై యున్నవి. ఈవేదార్థమందరకును దెలియమిచే వేదవ్యాసుడు వేదార్థమును పురాణేతిహాసములరూపముగా రచించెను. వీనికే యుపబృంహణవచనములని పేరు. ఆదియునుఁగాక శివునిముఖోద్భూతములగు కామికాది శివాగమములు కూడ యీవేదార్థమునే బోధించుచున్నవి. కావున వేదాగమపురాణేతిహాసములు మానవులకు ధర్మాధర్మములను బోధించు ప్రమాణగ్రంథములై యున్నవి.

ఈవేదములు కర్మకాండమనియు, జ్ఞానకాండమనియు, ద్వివిధము. అందుకర్మకాండము; తరచుగా ప్రకృతిస్వరూపమగు ప్రపంచమన నెద్దియో దానినెటుల దెలిసికొనవలెనో, పిమ్మట దానినెటులత్యజింపవలెనో, యీవివరము బోధించును. కొందరు ఋషులవలన యీవిషయము, ...పడుటకు సహాయకారిగనుండి జ్ఞాపకముచేయుటకై చిహ్నముగా 27 పోగులుగలనూలుయజ్ఞోపవీతధారణమును నాశనమగుప్రకృతివియప

ములు బోధపడినపిమ్మట జ్ఞానకాండననుష్ఠించుటకు, ప్రకృతిని విడుచుటకు సూచనగా యీయజ్ఞోపవీత విసర్జనమును పైనజెప్పబడిన ప్రాకృతులకొరకు యేర్పరచబడినది.

జ్ఞానకాండము నిత్యమగు బ్రహ్మమన నెద్దియో, దానిని దెలిసికొని, యాబ్రహ్మత్వ సిద్ధిని బడయుటెటులనో యామార్గమును బోధించును. ఈమార్గము ద్వివిధము. ఏచిహ్నమునుధరించకుండగనే బ్రహ్మత్వసిద్ధిని బడయుటయొక మార్గము. ఇది చాలకష్టతరమైనది. పరమాత్మను బోధించుటకు సూచనగా చిహ్నమునుధరించి బ్రహ్మత్వసిద్ధిని బడయుటయొక మార్గము. ఇదిసులభమార్గము. జ్ఞానకాండము, యీరెండుమార్గములను బోధించునుగాని వీనిలో పరమాత్మచిహ్నమునుధరించిన సులభమార్గమే శ్రేష్ఠమైనది. జన్మములకు కారణమై విడువతగిన ప్రకృతిని బోధించుటకు సూచనగా 27 పోగులుగల నూలుయజ్ఞోపవీతధారణము కర్మకాండయందు ప్రాకృతులకొరకు నెటులవిధించబడినదో యటులనే జన్మరహితమగువిడువదగనిబ్రహ్మమును బోధించుటకుసూచనగా బ్రహ్మమగు లింగయజ్ఞోపవీతధారణము విశుద్ధులకొఱకుజ్ఞానకాండయందు విధించబడినది. ఈలింగధారణము బ్రహ్మవిచారణలో చేరినది. ఎన్నడును విడువదగని బ్రహ్మమునకు సూచనగా లింగమునుధరించి బ్రహ్మవిచారణచేయుచుండియు విడువవలసిన ప్రకృతికి సూచనగా ధరించబడు నూలుజందెమును విడువక విరుద్ధముగా అనగా లింగమును ధరించియు నూలుజందెమునుకూడా ధరించుట ధర్మవిరుద్ధముగా నున్నది.

శ్రు॥ బ్రహ్మణచరతీతి బ్రాహ్మణః

శ్రు॥ బ్రహ్మవిద్ బ్రహ్మభవతి (పాస్యాద్బ్రహ్మవిత్కుటే భవతి)

(బ్రహ్మజ్ఞానేతుబ్రాహ్మణః)

(ఓమితి బ్రహ్మపరమం లింగాకారం మహేశ్వరం) ఇత్యాదిశ్రుతి ప్రమాణములననుసరించి బ్రహ్మమగు లింగమును ధరించి బ్రహ్మవిచారణ చేయుచు బ్రహ్మత్వసిద్ధినిపొంది తాను బ్రాహ్మణుడనను సంగతి తెలియక నూలుజందెమును ధరించనియెడల యితరులు తనను బ్రాహ్మణుడుగాడనుకొందురేమోయని కొందరుశాస్త్రవిరుద్ధముగా లింగమును, జందెమును (రెంటిని) ధరించుచుండుటధర్మవిరుద్ధముగానున్నది. బ్రహ్మమగు లింగమును ధరించినవానికి శివలింగ దీక్షావిధానమందలి క్రియా, మను, దీక్షలవల్ల సత్కర్మవేదాధ్యయనాధికారములుండుటవలన వేరే నూలుజందెము అవసరములేదనిచక్కగా బోధపడుటకు వేదాగమపురాణేతిహాసప్రమాణముల గనపరచుచు లింగయజ్ఞోపవీతమను పేరిటగ్రంథము రచించియున్నాడను. లేఖ ప్రమాదదోషములున్న గణింపక యథార్థమును గ్రహించెదరని వేడుచున్నాడను.

సంశయము లున్నవారలు మావద్దనుండు మహాలింగలీల; ప్రభులింగలీల, శైవసిద్ధాంత శిఖామణి, వీరశైవోత్కర్షసంగ్రహము, మొదలగు గ్రంథములు గాంచనగును. బుద్ధిమంతులు సారమును గ్రహించెదరని వేడుచున్నాడను.

పెద్దాపురం
గోదావరి జిల్లా

ఇట్లు విన్నవించు
(వీరశైవులు) చదువుల కోటయ్యశాస్త్రి.



శ్రీశివాయనమః

# వీరశైవమతతత్త్వము.



పరశివునకభిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశముపరశివుని విముఖతయే అధోముఖమగుట యనెడికర్మను జేయుటవలన నాకర్మవల్ల అజ్ఞానరూపమగు ఆవరణవచ్చినది. దానికే అవిద్యయని పేరు. అట్టిఅవిద్యయే జీవునికారణశరీరమైయున్నది. యిట్టిఅవిద్యయనగా అజ్ఞానమువల్ల జీవుడుమంచిచెడ్డలను విచారించకుండపెక్కుకార్యములను జేయుచుమంచికార్యములవలన వచ్చుసుఖమునకు సంతసించుచుచెడుకార్యములవల్ల వచ్చుకష్టములకు దుఃఖించుచునుండును. ఇట్టిదుఃఖనివృత్తిసాధనములగు సత్కర్మలను జేయువిధానమును దయాసముద్రుడగు భగవంతునివలన వేదములందు వివరింపబడియున్నది. గనుకనావిధానమును దెలిసికొనుటకు వేదాధ్యయనమును, అందు కధికారమును బొందుట కుపనయన సంస్కారమును నందలివిషయము బోధపడుటకు షడధ్వన్యాసమును అవసరమని యావేదములందేవిధింపబడియున్నది. కావున నీతద్విధికిముందు షడధ్వశుద్ధి ఆవసరము. యిందుకుప్రమాణము.

శ్రుతి=అధ్వనామధ్వపతే శ్రేష్ఠస్యాధ్వనః పారమశీయ॥

టీ॥ అధ్వపతే=షడధ్వలకు నధిపతివగు నో పరమేశ్వరా !

అధ్వనాం=షడధ్వలలో, శ్రేష్ఠస్య=ఉత్తమమైన

అధ్వనః=ప్రణవమునకు, పారం=వాచ్యుడవైననిన్ను

ఆశీయ=పొందుదునుగాక. అనగా సాధకుడుపరమేశ్వరు నుద్దేశించి నన్నుషడధ్వలలో శ్రేష్ఠమనగా వర్ణసారమైన ప్రణవమునకువాచ్యుడవగు నీతోజేర్చుకొమ్మనియర్థము.

గనుక నిట్టి ప్రమాణమునుబట్టి లఘుతరమగు షడధ్వశుద్ధితో గూడినట్టి యుపనయన సంస్కారముచేయబడి కర్మాచరణ వేదాధ్యయనములకధికారియనెడు తాత్పర్యమును బోధించుద్విజత్వ, విప్రత్వములను సూచింపబడు బిరుదచిహ్నముగా 27 అంతరసూత్రములతో గూడిన యజ్ఞోపవీతధారణము యేర్పరచబడెను.

లఘుతరమగు షడధ్వశుద్ధితో గూడిన యీయుపనయనసంస్కారమందు పెక్కుకర్మలున్నూ బహుతర వేదాధ్యయనమున్ను విధించబడియున్నవి. ఇవి పూర్తిచేయుటకు చిరకాలముపట్టును. పూర్తిగావించిననూ పుణ్యలోకప్రాప్తి యునటుపిమ్మట- క్షీణేపుణ్యేమర్త్యలోకేవిశంతి" యనెడి ధర్మము ననుసరించి" జన్మము లెత్తుచు మరలదుఃఖించుటయె గాని జన్మరహితమైన మోక్షము సిద్ధించుట కవకాశము లేదు. కావున నపుడు వేదములలో నుండుజ్ఞాన కాండములో జెప్పబడినట్టి బ్రహ్మోపదేశమునుబొంది తద్వారా మోక్షమును బొందవలసియున్నది. గనుక నటుల చిరకాలముకాకుండా శీఘ్రకాలములోనే మోక్షమును పొందించునదియు" కర్మాచరణము వేదాధ్యయనము బ్రహ్మోపదేశమును బొందుట యీమూడింటికిని అధికారమును బొందుటకు సాధనమగు శివలింగదీక్షను బొందుట ముఖ్యావసరమై యున్నది. యీ విధానము చక్కగా బోధపడుటకు సంపూర్ణమగు షడధ్వశుద్ధి విధింపబడినది.

ఇట్లు సంపూర్ణషడధ్వశుద్ధితో గూడిన శైవదీక్షయే మోక్షప్రదమున్ను, ముఖ్యమునై యున్నది. ఎట్లనిన;

శ్రు॥ ప్రీతమేతత్పాశుపతంతత్సమాచరేణ్ముముక్షుర్న పునర్భవాయ.

అని కాలాగ్నిరుద్రోపనిషత్తునందు గలదు. అనగా

ముముక్షుః = మోక్షముఁ గోరువాడు, నపునర్భవాయ = పునర్జన్మరాహిత్యమునకై, తత్ = ప్రసిద్ధమైన, ఏతత్ = ఈపాశుపతం, పాశుపతమనెడి, వ్రతం=దీక్షను, సమాచరేత్ = ఆచరింపవలయును పొందవలయుననిభావము. శ్రు॥ బృహజ్జాబాలమునందు॥ వ్రతమే తచ్ఛాంభవం సర్వేషు వేదేషు వేదవాదిభి రుక్తంభవతి । తత్సమాచరేన్ముముక్షుర్నపునర్భవాయ॥ అనియున్నది. అనగా శాంభవం = శాంభవమను పేరుగల, ఏతత్ = ఈ, వ్రతం = దీక్ష, సర్వేషు = సమస్తమైన, వేదేషు = వేదయములయందును, వేదవాదిభిః = వేదవిదులచేతను, ఉక్తం = చెప్పఁబడియెను. తత్ = దానిని, ముముక్షుః = మోక్షముఁగోరువాడు, నపునర్భవాయ— పునర్జన్మరాహిత్యమునకై సమాచరేత్ = ఆచరింపవలయును. అని యర్థము.

శ్రు॥ ఈశంజ్ఞాత్వా అమృతాభవన్తి॥ ఈశం=పరమేశ్వరుని, జ్ఞాత్వా=ఉపాసించునెడ, అమృతాః=ముక్తినొందినవారు, భవన్తి అగుదురు శ్రు॥ యదాచర్మవదాకాశం వేష్టయిష్యన్తి మానవాః । తదాశివమవిజ్ఞాయదుఃఖస్యాన్తోభవిష్యతి

అనెడు ప్రమాణములననుసరించి శైవమహాదీక్షయే మోక్షప్రదమని నిశ్చయింపబడినది

సంపూర్ణమగు షడధ్వశుద్ధితోఁగూడిన శివలింగ దీక్షావిధానమున కర్మాచరణపద్ధతిని బోధించు క్రియాదీక్షవలన ద్విజత్వమును, వేదమంత్రానుష్ఠాన పద్ధతిని బోధించు మనుదీక్షవలన విప్రత్వమును బ్రహ్మైక్యానుసంధాన పద్ధతిని బోధించు వేదాదీక్షవలన బ్రాహ్మణత్వమును సిద్ధించు క్రమము చక్కఁగ వివరింపబడినది ఇట్టిమహత్తరమగు శివలింగదీక్షాసంస్కారమునవిశేషమేమననిరాకారనిరంజన పరబ్రహ్మమునకు రూపములేదు గనుక నట్టి దేవునియందు దృష్టినిల్పుటకు నూతనాభ్యాసికి సాధ్యముకాదు. గనుకనట్టి పరబ్రహ్మమును జ్ఞాపకము

చేయుటకున్ను అట్టిపరశివతత్వమేయిదియనియనుసంధానము చేసుకొనుటకున్ను పైనివ్రాసిన ప్రకారము కర్మాచరణ వేదాధ్యయన బ్రహ్మైక్యానుసంధానమునకధికారియనెడుతాత్పర్యమునుబోధించు ద్విజత్వవిప్రత్వబ్రాహ్మణత్వములనుసూచింపబడుటకున్ను, ఇట్టులన్ని విధములకనుకూలమగు బిరుదుచిహ్నముగా త్రివృత్సూత్రముయజ్ఞోపవీతము పవిత్రము అనుతాత్పర్యమిచ్చునట్టిలింగధారణముయేర్పరచబడెను. శివలింగ దీక్షాసంస్కారమువల్ల మోక్షప్రదమగు బ్రహ్మోపదేశమునకధికారియగుటయేగాక నుపనయనసంస్కారమువల్ల బొందబడెడుకర్మాచరణ వేదాధ్యయనాధికారములు కూడ బొందబడుట వల్ల వేరేయుపనయనసంస్కారముగాని అందునిమిత్తమేయేర్పరచబడిన 27 సూత్రములతోకూడిన నూలుజందెముగాని అవసరములేదనియెంచబడిస్వతంత్రవీర శైవమునందు కర్మాధికార వేదాధ్యయనాధికార బ్రహ్మైక్యానుసంధానాధికారములను సూచించు శివలింగ ధారణము మాత్రము యేర్పరుపబడి నూలుయజ్ఞోపవీత ధారణము మానివేయబడెను. మరియు ఈమూడింటిలో జన్మరహితమును బొందించు బ్రహ్మైక్యానుసంధానముత్తమమయినప్పటికి కర్మాచరణ, తాత్పర్యసహిత వేదపారాయణములుకూడానవసరమేగనుక విడువగూడదు. ఎందువల్లననగా వేదపారాయణమువల్లగాని ధర్మములు బోధపడవుగాన, వేదాధ్యయనమవసరము. అయినను వేదమందలి పరశివపరబ్రహ్మతత్వమును బోధించునట్టివియు ఆబ్రహ్మమందు లయమును బొందించుటకు సాధనమగునట్టిదియునగు ప్రణవపంచాక్షరీమంత్రము నమక చమక, పంచబ్రహ్మమంత్రములు మొదలగు భాగములను మాత్రమంగీకరించి తక్కిన శ్రు॥ ఏక మేవాద్వితీయంబ్రహ్మ॥ శ్రు॥ ఏకఏవరుద్రోనద్వితీయాః॥ అనుశ్రుతులకు విరుద్ధముగా ననేక దేవతలున్నట్టు తోపించు నట్టియు శ్రు॥ శివప

కోధ్యేయః సర్వమన్యత్పరి త్యజ్య । శివాదన్యంతు దైవతం॥ అను శ్రుతులకు విరుద్ధముగా॥ ఏకదేవతోపాస్తికియాటంకమును గలిగించునట్టి బహుదేవతోపాసనాది రూపకములగునట్టియు బ్రహ్మనిష్ఠకు భంగముకలిగించునట్టివియునగు యితరభాగములను విడువవలయునని యెంచబడి, విడువబడెను.

కర్మస్వరూపము.

శివలింగదీక్షావిధానమందలి వేదాదీక్షస్వరూపమగు బ్రహ్మైక్యానుసంధానముకొరకు జీవునకు జ్ఞానము ప్రధానమై యున్నప్పటికి కర్మాచరణముకూడా అవసరమైయున్నది.

ఎందుకనగా

జీవుడు తనజ్ఞానముచేత బ్రహ్మపదార్థ మొకటియున్నటుల దెలిసికొని యాబ్రహ్మమందైక్యముబొందుటయనెడి పనిని జేయవలసి యున్నది. గనుక ఆపనికే కర్మయని పేరు. కావున కర్మ అవసరము.

మరియొకవిధము

ప్రతిజీవునకును జ్ఞానముతోకూడిన జ్ఞానేంద్రియములును క్రియను జేయునట్టి కర్మేంద్రియములునుకూడాఅవసరము. కర్మేంద్రియములు లేనిజ్ఞానేంద్రియములును, జ్ఞానేంద్రియములులేని కర్మేంద్రియములును వ్యర్థము. వీనియొక్క పరస్పరసహాయముచేత జీవుడుసంకల్పించిన కార్యము సులభముగా నెరవేరును.

శ్లో. అపశ్యన్నంధకోదగ్ధః । పశ్యన్దహతిపంగులః
అంధపంగువదన్యోన్యసాపేక్షేజ్ఞానకర్మణీ॥

ఇల్లుకాలుచుండ నయ్యదికనబడకపోవుటచేతగ్రుడ్డివాడును, కనబడినను కాళ్లులేమిచేనటనుండి పోజాలకకుంటివాడును,తుదకునిద్దరును, కాలి

పోయిరి. వీరిద్దరు చేరియుండు రేనియిల్లుగాలుచున్న వార్తను కుంటివాడు గ్రుడ్డివానికి దెల్పును. గ్రుడ్డివానికి కాళ్లుగలవుగాన నతడుకుంటివానిని మోసికొనిపోవుచు కుంటివాడుతనకుదారి తెలుపుచుండ నిట్లిద్దరునునట నుండితొలగిపోయి అన్యోన్యసహాయము చేత,నాపదనుదప్పించుకొందురు. ఇందు జ్ఞానము కుంటివానిబోలిననది.కర్మముగ్రుడ్డివానింబోలినది. ఈ రెండును చేరినంగాని కార్యసాధనములు కాజాలవు. ఇది శాస్త్రసిద్ధము. పూర్వాచార్యసిద్ధాంతమునై యున్నది. దీనింబట్టికర్మమార్గము జ్ఞాన విశేషమనబరగిన యుపాసనమార్గము చేరి యీ రెండును నవశ్యపరిగ్రాహ్యములైయున్నవి.

మరియు జ్ఞానాంగముతోకూడిన బ్రహ్మోపాసనకు కర్మేంద్రియములతోకూడిన స్థూలదేహముకూడా అవసరమైయున్నది. జీవుడు జ్ఞానమును సాధనముగా యేర్పరచుకుని బ్రహ్మోపాసనమును జేయుచున్నప్పటికి స్థూలదేహముననుండియే చేయవలయును. లేనియెడల- జీవునకు స్థానము లేకపోవును. గనుకస్థూలదేహముండితీర వలయును ఉన్న ఎడలనీ దేహమునుసరియగుస్థితిలో నుంచకుండినయెడలబ్రహ్మనిష్ఠకు భంగముకలుగును. గావున నందులకై దీనిని చక్కగపోషించి రక్షించ వలెను. దీని పోషణనిమిత్తమై దీనియొక్క కర్మేంద్రియములతో కొంత పనిజేయవలసియున్నది. ఆపనికే కర్మయని పేరు. ఈ కర్మ బ్రహ్మోపాసననిమిత్తమైసాధనము జేసుకొనుట కొరకుపయోగింపబడు దేహమునిమిత్తమై జేయబడినదిగావున,నదిబ్రహ్మైక్యానుసంధానమునకై చేయబడిన కర్మగానేయెంచబడును. అయినప్పటికి దేహము ప్రపంచ సంబంధమయినదిగావున నీదేహరక్షణముకొరకు జేయబడునట్టి యీకర్మ ప్రపంచముతోకూడా కొంతసంబంధమును కలిగియుండును. అందువల్ల నీకర్మ నాచరించునప్పుడు ప్రపంచముతోచూడ బ్రహ్మదృష్టిని మ

లుగుపరచుచుండును. గనుక నటులమఱపు రానివ్వకుండా భగవంతుని జ్ఞాపకము జేయుటకు సూచనగా శివలింగధారణమునుబొంది దేహసంరక్షణముకొరకు స్థూలదేహేంద్రియములతో జేయబడు ప్రతిపనిలోను న్నూ బ్రహ్మమును జ్ఞప్తిచేయుటకొరకు యేర్పరచబడిన షట్స్థలజ్ఞానయుక్తశివలింగార్చనవిధానరూపమగునట్టియు, ఏతద్విధికిముఖ్యముగ కావలసిన భస్మసంపాదనావసరశివాగ్ని హోత్రార్థ సమిత్సంపాదనరూపమగునట్టియు కర్మలనుమాత్రమే యాచరించుచు తక్కినతన దేహసంరక్షణము కొరకుగానటువంటియు ॥శ్రుతి॥ ఏకమేవాద్వితీయంబ్రహ్మః శ్రు॥ ఏకఏవరుద్రోనద్వితీయా॥ యనెడి శ్రుతులననుసరించి దేవుడొక్కడేయనుచుతోపించు భావమునకువిరుద్ధముగా పెక్కుదేవతలున్నట్టుతోపించునట్టి బహుదైవతార్చనారూపమగుకర్మలనున్నూ శ్లో॥అహింసా పరమోధర్మా॥ యనుధర్మవచనమునకు విరుద్ధమైనట్టి ప్రత్యక్షజీవహింసారూపమగు యజ్ఞాదికర్మలనున్నూ దేహారోగ్యవిరుద్ధాదిపాపకర్మలనున్నూ విసర్జించుట యుక్తమనియెంచి విడువబడెను.

మఱియు ఉపనయన సంస్కారమునుబొందినవారలుచేయవలసిన బహుదేవతోపాసనములు, యజ్ఞయాగాదికర్మలు,కూడ వేదములందు పరమేశ్వరునిచే నాజ్ఞాపించబడినవేకావున,నవియు అవసరములేదనియు, నెట్లనిన ?

ఒకరాజు కొలువుకూటమునందు రాజోపచారముల కొరకునియమింపబడిన భృత్యులారాజునకేకాకుండా ఆరాజుయొక్క పుత్రపౌత్రబంధువుల కుపచారములుచేసినయెడల రాజుకోపించక తన పుత్రాదులకు చేసిన యుపచారములుకూడా తనతోసంబంధించినవేగనుక తనవిగానే భావించి యాభృత్యులనాదరించెడి విధమునభగవంతుడుతననుపూజించు భక్తులు బహుదేవతారాధనమును యజ్ఞయాగాదికర్మలను జేసినప్పు

టికి అవియన్నియు వేదములందు తనచేనాజ్ఞాపించబడినవేగనుక తనని మి త్తమై చేయబడినవిగానేయెంచి, వారినికూడా రక్షించుననియు యెం చి, అవికూడాచేయతగదు.

ఎందువల్లననగా,ఆరాజుతనభృత్యులలో నెవ్వరైననుసరేతన చే నియమింపబడిన యొకగోజున ప్రాతఃకాలము మొదలు సాయంత్రము వరకు నొకనిమిషమైనను విడువకుండా తనకు పాదసేవచేయువాడు తన యాస్థానమునందు కొలువుతోనిమిత్తములేకుండా తనతాలూకు భోజన శాలలో శాశ్వతముగా తృప్తిగాభోజనముచేయుచు స్వేచ్ఛగానుండు ట కర్హుడనియు ఆరోజు పగటికాలమందే తనపుత్రపౌత్రాదులకు సేవజేయువాడు తనకొలువునందు చిన్నిచిన్ని యుద్యోగములుచేయు చు చిరకాలమునకు తనభోజశాలనుదర్శించి పిమ్మట తనయాజ్ఞనుబొం ది యచటభుజింప నర్హుడని చట్టము యేర్పరచినపుడు ఆచట్టమునకు విరుద్ధముగా రాజునకు పాదసేవచేయవలసిన కాలపరిమితిలో కొంతత గ్గించి ఆకాలమును రాజపుత్రపౌత్రాదులసేవకొరకు కుపయోగించినయె డల నాయుపచారము రాజోపచారముగా యెంచబడదు. సరేకదా చ ట్టమునకు విరుద్ధముగ రాజభోజనశాలలో భుజించిస్వేచ్ఛగా సంచ రించుటకర్హుడుకాడు.

అటులనే యేకలింగ నిష్ఠాగరిష్ఠులు మోక్షమునొందుట కర్హు లనియు. బహుదేవతారాధనపరులు వారల వారల యారాధనలకు దగిన పదవులబొందుట కర్హులనియు వేదాగమములయందు దేవుని వల్లనాజ్ఞాపింపబడియుండిరిగనుక యేకదేవార్చనపరులు మోక్షమున్నూ తక్కినవారు వారివారికి దగిన పదవులనుబొంద నర్హులుకాని శివలింగ దీక్షావిధానములోని యేకాగ్రచిత్తదీక్ష మొదలగు విధులకున్ను దేవుని యాజ్ఞకున్ను విరుద్ధమగు బహుదేవతోపాసనపరుల యర్చనము

దై వాజ్ఞకు విరుద్ధముగా దేవునిదిగా భావింప బడదు. గాన వారలు మోక్షమును బొందనప్పాలుగారు.

మరియు నీ బహు దేవతా రాధనము సర్వదేవతాసముద్ధితో జేయుదమని యెంచినప్పటికి కష్టతరమైనమార్గమే కాని సులభమార్గము కాదు. యెందువల్లననగా, ఇందు్రిడు-బ్రహ్మ-సూర్యుడు-విష్ణు-సింహము-గురి్రము-సర్పము-కోతియనెడు పదములు హరియనెడుశబ్దమున కర్థ మిచ్చునట్టివియైయున్నప్పటికి ఆయాపదముల ననగా- గుర్రము సర్పము-కోతి-యనెడుపదములను విడిగానుచ్చరించునపుడు యీనామములను గల గుర్రము-సర్పము-కోతియనెడిజంతువులు కూడానుండుట వలన,నవియే తోచుచుండునుగాని,ఆశబ్దములకర్థ మిచ్చునట్టిహరియను శబ్దముసాధారణముగా తోచదు.

అటులనే బహుదేవతార్చనా సరణియైనగాయత్రియందు చెప్పబడిన అగ్ని—బ్రహ్మ—విష్ణు—రుద్రుడు—వసువు-లు—భూమి— మొదలుగాగల దేవతలనామములన్నియు భగవంతునికికూడా అర్థమిచ్చునట్టివియైయున్నప్పటికి అర్చనావిధానములోవిడివిడిగా నాయా దేవతల నాహ్వానము చేసి యా దేవతలనారాధించుచు ఆయా దేవతలనామములనుచ్చరించునపుడు భగవంతునిదేకాకుండా యానామములనుగల అగ్ని—విష్ణు—బ్రహ్మ—రుద్రుడు—వసువులు-భూమి మొదలుగాగల దేవతలుకూడా కొందరున్నందున వారలే సాధారణముగా తోచుచుందురుగానిభగవంతుడు స్ఫురణకువచ్చుటదుర్లభము.గనుకభగవంతునికిమినహా కొందరు దేవతలున్నట్లు తోపించునట్టి బహుదేవతారాధనము మోక్షప్రదముకాదని యెంచి విడువబడెను.

మరియు నరమేధ—అశ్వమేధ—గోమేధము మొదలగుయాగములు వేదమందుజెప్పబడి పూర్వులచేనాచరింపబడినవై నప్పటికి దరిఖిలాను

విడువబడినవి. వేదమందు జెప్పబడినవేయని యెంచి సాహసించి నరమే ధయాగము జేయనెంచిన యెడలయేమనుజుడయినా యజ్ఞ పశువుగా నుండుటకు సమ్మతించునా? సమ్మతించడు. ఈయజ్ఞములు భగవదాజ్ఞస్వ రూపము లయిన వేదములయందు జెప్పబడినప్పటికి దరిమిలాను కొన్ని ధర్మములల నాధారము జేసికొని మహర్షులీయజ్ఞములనువిడనాడిరి. ప్రత్యుత హింసాస్వరూపములయిన్న యజ్ఞములు వేదములలో జెప్పబడినను ఈ హింసాపరమోధర్మమనెడిగొప్పధర్మము నాధారము జేసికొని భూతద యాపరులగు వీరశైవులచేనీయజ్ఞయాగాదికర్మలుపూర్వకాలముక్రిందట నేవిడువబడియెను.

## సుజ్ఞానము.

జీవునకు దుఃఖనివృత్తికొరకు యేర్పరచబడిన సంపూర్ణమడధ్వ శుద్ధియుక్తశివలింగ దీక్షావిధానమందలి క్రియాదీక్షస్వరూపమగు కర్మాచరణము, మను దీక్షాస్వరూపమగు వేదమంత్ర పారాయణము యెట్లవసరమో అటులనే వేదాదీక్షస్వరూపమగు బ్రహ్మైక్యాను సంధానయుక్తసుజ్ఞానముకూడా అవసరమైయున్నది.

ఎందువల్లననగా, మొదట సూర్యునియందు ప్రకాశస్వరూప మగు ఆతపము, అగ్నియందుష్ణము, యెటుల విడదీయుటకు వీలులేకుండ యున్నవో, అటులనే పరశివునియందభిన్నముగా తాను పరశివాభిన్నమునే యని తెలుసుకొనునట్టి చిచ్ఛక్తియున్నది. ఆపరశివుని విడువకయే ఆపరశివుని సంకల్పమువలన నాచిచ్ఛక్తియొక్క అంశము అధోముఖమగుట యనెడుకర్మను జేయుటవలన అజ్ఞానస్వరూపముగా మారిపోవుటయనెడు ఆవరణము యేర్పడెను. (అనగా తనను తాను మరచిపోవుట) అట్టిఆవరణమునకే అవిద్యయని పేరు. ఇట్టి యవిద్యయే జ

న్మమునకు కారణమగుటవలన నాయవిద్యకు కారణశరీరమని పేరువచ్చెను. ఇట్టికారణశరీరముతో కూడుకునియున్న చిచ్ఛక్త్యంశముక్రిమముగా సూక్ష్మ, స్థూలశరీరముతో గూడి పరశివతత్వమును విడువకయేయుండుటవలన జీవుడనిచెప్పబడి సంజ్ఞనుబడసెను. జీవుడుక్రిమముగా ప్రిపంచ్యవ్యాపారములతో కూడుకుని అందువలన వచ్చుకష్టములకు దుఃఖించుచుండును ఇదియే అజ్ఞానము ఇట్టిదుఃఖనివృత్తికొరకు సద్గురునివల్ల సంపూర్ణషడధ్వశుద్ధి యుక్తశివలింగ దీక్షాసంస్కారమును విధ్యుక్తముగా వేదాగమను క్రియాదీక్షల పూర్వకముగాబడసి అనగా దృష్టికి గోచరముగానటువంటి కారణ సూక్ష్మదేహములకు దృష్టిగోచరముగానట్టి భావలింగ ప్రాణలింగ రూపవములుగానున్న దృష్టికిగోచరమగునట్టి వ స్థూల దేహమునకు దృష్టి గోచరమగునట్టి యిష్ట లింగ రూపకముగానున్నా తాదాత్మ్య సంబంధముగా శివలింగధారణమును బడసి క్రిమపద్ధతిని తనను తాను దెలుసుకొనుట యనగా తాను పరశివాభిన్నుడనని దెలిసికుని యాపరశివ తత్వమందు లయమును బొందుటమూలముగా దుఃఖనివృత్తిని బొందును అనగా శాశ్వత బ్రిహ్మానందసుఖమును గాంచును ఇదియే సుజ్ఞానము. ఇట్టిసుజ్ఞానము మాత్రిము స్వీకరింపబడి కర్మాచరణ వేదాధ్యయనముల లోనుండి సత్వర బ్రిహ్మైక్యసిద్ధికి యాటంకమును గలుగజేయు భాగములు విడువబడినట్లు సత్వర బ్రహ్మైక్య సిద్ధికి యాటంకమును గలుగజేయు ప్రపంచ సంబంధమగు అజ్ఞానముకూడా వీరశైవులచే విడువబడెను. ఈ యిష్టప్రాణభావలింగములు - దృష్టిగోచర - మనోగోచర జ్ఞానగోచర పదార్థములన్నియు పరశివాభిన్నమని అభ్యాసము జేసికొనుటకు సాధనములైయున్నవి.

సూతకములు

ఉపనయన సంస్కారపరులకు వివాహదీక్షతో కూడిన పంచరాత్రిముల మధ్య తటస్థించిన మృతసూతకముతోనున్నా ప్రిపొండరీక

యజ్ఞ దీక్షతో గూడిన 40 దివసములమధ్య తటస్థించిన రజస్సూతకము తోనున్నా ఆయా దీక్షాకాలములుగడిచేవరకు సూతకపు మైలతో నిమిత్తం లేదనియు మరియుకొన్నికొన్ని సందర్భములలో పంచ సూతకములతో నిమిత్తంలేదనియు యెంచబడినట్లు,

సంపూర్ణమగు షడధ్వశుద్ధి యుక్తముగా వేదాంమనుక్రియాదీక్ష లనుబొంది శ్రు॥ పవిత్రంతే వితతం బ్రిహ్మణస్పతే॥

శ్రు॥ పాణిమంత్రం పవిత్రం॥ అనెడు శ్రుతుల ననుసరించి కడు పవిత్రమైన శివలింగధారణమును బొంది తల్లింగ సంపర్కముచేత తమ తమజీవితకాలమువరకు తరుగని పవిత్రతను బడసిన శివలింగ దీక్షాసంస్కారవరులకు సర్వకాలములయందు యెప్పటికిన్ని జాతిజన్మ రజోచ్ఛిష్ట ప్రేతకాది పంచసూతకములతో నిమిత్తంలేదని యెంచబడి నది. మరియు జీవహింసయే వృత్తిగాగల పల్లెకులజుడగు వ్యాసుడు వ్యభిచార వృత్తిగల భోగకులజుడగు వసిష్ఠుడు మాలకులజుడగు మతం గుడు చాకలికులజుడగు నారదుడు పంచమకులజుడగు భరద్వాజుడు మొదలగువారు శివసంస్కారమునుబొంది బ్రహ్మజ్ఞానమును సంపా దించి జాతిసూతకరహితులై తాము పరిశుద్ధులుగా యెంచబడుటయే గాక ప్రస్తుత కాలపు బ్రాహ్మణులలో చాలామందికి గోత్రపురుషులగు మూలపురుషులుగా నున్నారు వైష్ణవ మతగురువులగు పన్నిద్దాళ్వా రులలో కొందరు పంచమకులజులైనను విష్ణుసంస్కారమునుబొంది పరి శుద్ధులై జాతిసూతకరహితులై వైష్ణవమతస్థులకు గురువులుగానున్నారు అటులనే వృషభ-నంది-భృంగి వీరభద్ర కుమారస్వాముల స్వరూపు లగు రేవణసిద్ధ మరుళసిద్ధ ఏకోరామ పండితాచార్య విశ్వాచార్యుల చేతనున్నా క్రమముగా వీరిసంతతి వారిచేతనున్నా, పెక్కుకులజులు

శివలింగదీక్షా సంస్కారమునుపొంది పరిశుద్ధులైజాతిసూతక రహితులై వీరశైవమతమున శిష్యులుగానున్నారు.

## ఆ శ్ర మ ము లు

బ్రహ్మచర్యమందు యజ్ఞోపవీతమును ధరించిగురు శుశ్రూషను జేయుచు వేదాధ్యయనాది శాస్త్రముల నభ్యసించి గృహస్థులై యతిథిసత్కారము యజ్ఞములు దానధర్మములు పుణ్యలోకసుఖాపేక్ష యుక్తసంతాన ప్రయత్నము - మొదలగు పెక్కు కర్మల నాచరించి పిమ్మట వానప్రస్థులై కందమూలాది భక్షణము జేయుచు భూశయన వ్రతమును బూని పత్నీపుత్రాదులపై నతిప్రేమను వర్జించి సర్వదేవతారాధనము సల్పుచు బ్రహ్మ విచారణమును జేయుచు పిమ్మట నీయాశ్రమములు మూడును విడిచి శిఖాయజ్ఞోపవీతాగ్ని హోత్రములను విడచి సన్యసించి దేశాటనమును సల్పుచు బ్రహ్మనిష్ఠగలవారై బ్రహ్మైక్యసిద్ధిని బడయుట చతురాశ్రమముల స్వరూపమైయున్నది. ఈ పద్ధతి కొన్నికష్టములును విరుద్ధధర్మములును సత్వర బ్రహ్మైక్య సిద్ధికి యాటంకమును గలిగియున్నది. బహుతరశాస్త్రాభ్యాసము కష్టమును సత్వర బ్రహ్మైక్య సిద్ధికి కాలయాపనమును నైయున్నది. యజ్ఞములు ప్రత్యక్ష జీవహింసారూపములును దానధర్మములు పుణ్యలోక ప్రాప్తములైనను మరలజన్మదుఃఖకారణములునై ఫలాపేక్షసంతాన ప్రయత్నము మోక్షప్రాప్తి కారణముకాదు సరేకదా ! జన్మకారణములగు పుణ్యలోక ప్రాప్తికి పరాపేక్ష యుక్తములు. అనభ్యాస కందమూలాది భక్షణమును బలహీన దశలోని భూశయ్యావ్రతమును కష్టతరములై యున్నవి. బహుదేవతారాధనమే ఏకదేవతోపాస్తికి యాటంకమైయున్నది ఈధర్మముల నాచరించినప్పటికి సన్యాసమందు విడువదగినవైయున్నవి. మొదటి మూడాశ్రమములలో నాచరించిన ధర్మములకు

సాధనములగు శిఖాయజ్ఞోపవీతాగ్నిహోత్రములను విడుచుట విశ్వా
సరహితమైయున్నది. దేశాటనము కష్టము గనుక నీపద్ధతిలో కొన్ని
కష్టములనియు కొన్ని ధర్మ విరుద్ధములనియు కొన్ని బ్రహ్మత్వ ప్రాప్తి
కి కాలయాపనములనియు యెంచి విడుచుటకంటె యీ చతురాశ్రమ
ములలోనిధర్మములలోనున్నూ బ్రహ్మైక్య సిద్ధికికొన్ని ముఖ్యములున్నూ
కొన్ని అనవసరములుగానున్నూ తోచుచున్నవి. గావున నీనాలుగా
శ్రమములలోనున్నూ కొంతకాల మాచరించి మగల తగ్గింపబడునవిగా
నట్టియు సత్వర బ్రహ్మత్వ సిద్ధికరములగునట్టివియు అనగా బ్రహ్మ
చర్యమందలి గురుశుశ్రూషయుక్త లింగార్చ నావసర వేదమంత్రాధ్య
యనమున్నూ గృహస్థమందలి అతిథిపూజారూపమగు గురులింగ జం
గమ భక్తజనకైంకర్యము, ఈశ్వరేచ్ఛానుసార అనగా లింగ భోగోప
భోగరూపసత్సంతానప్రయత్నములున్నూ వానప్రస్థమందలి దారా
పుత్రాదులపై నతిప్రేమను తగ్గించుట బ్రహ్మవిచారణములున్ను
సన్యాసాశ్రమమునందలి బ్రహ్మైక్యానుసంధానమున్నూ మొదలు
గాగల ముఖ్యములగు చతురాశ్రమములలోని ధర్మములున్నూ గలిగి
యున్నట్టియు, ఈ ధర్మములనన్నిటిని పరస్పరవిరుద్ధముకాని మార్గమున
నాచరించుటకు వీలునుగల భక్తమహేశ్వర -ప్రసాద, ప్రాణలింగ, శర
ణైక్యములనెడి షడ్స్థలజ్ఞానసంపత్తితోగూడినట్టివగు చతురాశ్రమముల
కన్న నతీతమై వెలసెడి యత్యాశ్రమమును స్వీకరించి వీరశైవులు
యిందుకు చిహ్నముగా (శివలింగధారణము) త్రివృత్సూత్రముయజ్ఞో
పవీతములనెడు పర్యాయనామములనుగల శివలింగ ధారణమును బొంది
ధన్యులైరి.

మరియు నీమతతత్వమును పరళీవైద్యనాథ లింగాభిషేకవ్యాజ్య
పరిష్కారము, అనగా వీరశైవులగు లింగాయతులు. వీరు శివలింగమే

యజ్ఞోపవీతమని తాత్పర్యముగనుక వేరే మరియొక యజ్ఞోపవీత మవస రములేదని యెంచి లింగమును మాత్రమే ధరించి పూజించువారు వీరిలో మైసూరు మహారాష్ట్ర, కొడగు, కెళది, నేపాళ, మొదలగు అనేక మహారాజులచే మహారాజ జగద్గురు మొదలగు బిరుదములు, జాగీర్లు,భూములు, నివ్వబడి యిప్పటివరకములలో సన్న గొప్పసింహాస నములు కాశీ-కేదార శ్రీశైల ఉజ్జయినీ - చిత్రదుర్గము మొదలగు గ్రామములలో కలవారు కలరు. వీరికిన్నీ అన్యమతస్థు లకున్ను నాలుగు వత్సరములు నైజాంరాష్ట్ర బీడుజిల్లా పరళీగ్రామ వైద్యనాథ,లింగాభిషేకమును గురించి జరిగిన వ్యాజ్యములో నైజాం గవర్నమెంటువారి వలన యేర్పరచబడిన కమిటీవారుభయపక్షపం డిత మహాజనసభ గావించి విమర్శించుట పూర్వకముగా లింగాయ తులు వేదాధి కారముతో దేవాలయములలోని లింగములు సహా సర్వలింగముల కభిషేక పూజాదుల స్వయముగ జరుపుకొనుట కర్హు లనియు వీరు పరమవైదికులనియు నైజాం గవర్నమెంటువారు గావిం చిన తీర్పును జూచినయెడల సమగ్రముగ దెలియగలదు. గనుక

బేహాగ్-ఆదితాళం

1 పరబ్రహ్మ మనబడు।వరశివలింగమును।ధరియింపగల్గుము క్తిపదము
నిరతముబూజించు। నిర్మలులకుగల్గు। నిరుపమాన నిత్యసుఖము ॥

2 దేవుడుగలడను । భావముగుదుపుట। దివ్యజ్ఞానమనబడును।
దేవుడెవ్వడో జీవుడెవ్వడో। దెలియుటయును ముఖ్యముసుమా ॥

3 దేవుడుబ్రహ్మము। దేవుడులింగము । దేవుడు పరశివుడుసుమా ।
దేవునియంశమె । జీవుడయ్యెనని । దెలిపెను వేదములుసుమా ॥

4 దేవునియంశమగు జీవుడుతన్నదా । దెలియక దుఃఖపడునుసుమా
జీవుడుమరియా। దేవునిలోనికి । జేరుటముక్తియగునుసుమా॥

5 ముక్తినిగాంచుటకు భక్తిమూలముగాన భక్తిగలుగవలెనుసుమా ।
భక్తిగుదురుటకు బాగుమీరనొక - యుక్తిని దెలిపెదవినుమా ॥

6 త్వరితంబుగలే ఖరియుద్దేశము । దగదెల్పులేఖనఁబోలి ।
గురునిబోధరూప పరతత్వముందెలుపు। వరలింగము వెలయునుసుమా॥

7 దేవునిజ్ఞప్తికి దెచ్చుటకొరకా । దివ్యలింగముధరించి।
భావంబునునట బ్రహ్మభావమును ॥ బాయకుండగానుంచి ॥

8 ప్రాజ్ఞులులింగమె యజ్ఞోపవీతముగ భావనజేయుచు బ్రహ్మ
జిజ్ఞాసనుపడి । జేయుచు మోక్షము । జెందగవలయునుసుమ్మా॥

9 పలుతావులకును । బారెడుచిత్తమును । బారకుండమరలించి ।
సలలితముగనా । శంభులింగముపైని । నిలిపినిర్మలతగాంచి॥

10 ఘనమగునాలింగ । కళయే తానైతి । ననియెడుమర్మమెరింగి ।
అనిశముసోహం।బనియెడుజపమున। నానందమున మెలఁగి ॥

11 తానెవగోతను తానుదెలియుటచే । తానేదైవమైదసరి ।
తానెబ్రహ్మమై తనకన్యములేక । తానెలింగమగునుసుమా ॥

12 విసువకననిశము వేడెడిహారల । వేడ్కతోగాచెడివాడై ।
బసవశంకరుని బాగుజేసినవీర । బసవగురునిదీక్షబడసి ॥

ఇట్లు,

గోదావరిజిల్లా పెద్దాపురము
ప్రస్తుతము సామర్లకోట

చదువుల బసవశంకరయ్య.

ఓం తత్సత్

శ్రీ సద్గురులింగాయనమః

# లింగ యజ్ఞోపవీతము



శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిమ్ । విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్ । ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం। భావాతీతంత్రిగుణరహితంసద్గురుం తన్నమామి॥

శ్రీమద్బసవేశ్వరాద్యసంఖ్యాత నూతన పురాతన మహాప్రమథగణచరణారవిందాభ్యాంనమః॥

## యజ్ఞోపవీతము.

ఇది ద్వివిధము. ప్రపంచమును బోధించుటకు సూచనగా ధరింపబడు 27 పోగులుగల (నూలుయజ్ఞోపవీత మొకటి) పరబ్రహ్మమును బోధించుటకు సూచనగా ధరింపబడు నిర్మలలింగ యజ్ఞోపవీత మొకటి, నూలుయజ్ఞోపవీతము:— పరశివ పరబ్రహ్మమందు అగ్నియందుష్ణము, చంద్రునియందలి చంద్రికవలె విడదీయుటకు వీలులేక అభిన్నముగ పరబ్రహ్మణి ఊర్ధ్వముఖవ్యాప్తిగలిగియుండి పిమ్మట పరశివుని యిచ్ఛామాత్రంబునఅధోముఖముగలిగినదై మలినసత్వప్రధానమై మూలప్రకృతియను నామంబున బరగుచుండును. ఆమూలప్రకృతి తోడుత సత్వరజస్తమోగుణంబులను త్రిగుణములచేత త్రిశక్తులుగ

లక్ష్మి, సరస్వతీ, పార్వతీ లేక గాయత్రి, సావిత్రి, సరస్వతులుగా దోచి వెనుక అతిగుణపరస్పర సమ్మేళనమువలన నవవిధములై పిదప ఆనవ విధాన్యోన్య సమ్మిళితముచేత సప్తవింశతి (27) విధములైన సృష్టిని జేసెను. అనగా 1 సత్వతమస్తమస్సు, 2 సత్వతమోరజస్సు 3 సత్వతమస్సత్వము, 4 సత్వరజస్తమస్సు, 5 సత్వరజోరజస్సు, 6 సత్వరజస్సత్వము, 7 సత్వసత్వతమస్సు, 8 సత్వసత్వరజస్సు, 9 సత్వసత్వసత్వము, 10 రజస్తమస్తమస్సు, 11 రజస్తమోరజస్సు, 12 రజస్తమస్సత్వము, 13 రజోరజస్తమస్సు, 14 రజోరజోరజస్సు, 15 రజోరజస్సత్వము, 16 రజస్సత్వతమస్సు, 17 రజస్సత్వరజస్సు, 18 రజస్సత్వసత్వము, 19 తమస్తమస్తమస్సు, 20 తమస్తమోరజస్సు, 21 తమస్తమస్సత్వము, 22 తమోరజస్తమస్సు, 23 తమోరజోరజస్సు, 24 తమోరజస్సత్వము, 25 తమస్సత్వతమస్సు, 26 తమస్సత్వరజస్సు, 27 తమస్సత్వసత్వము అని యిరువదియేడు భేదములయ్యెను. అనగా తెల్లనివస్త్రమున చిత్రములు కల్పితమైనట్లు ఆ శుద్ధపరబ్రహ్మమునందు పై చెప్పబడిన 27 భేదములుగల సృష్టిగలయట్లుగనపరచెను. ఈయిరువదియేడు భేదములుగల సృష్టికి కారణమైన ప్రకృతిమయమగు గాయత్రి మూడుపాదములును భూర్భువస్సువయను వ్యాహృతిత్రయముతోడ 27 అక్షరములుగలదని బ్రపంచమనగానెద్దియో తెలియగోరువారికి నుపాస్యముగ నిర్ణయించబడెను ఆగాయత్రికి మారురూపమగు యజ్ఞోపవీతమునకు మూడుసూత్రములుగలవు అందొక్కొక్క సూత్రమునకు మూడేసి యంతరసూత్రములు గలవు ఆయంతరసూత్రముల యందొక్కొక్క సూత్రమునకు మూడు పెద్ద పోగులు గలవు గాన 3 పెద్దపోగులుగల యజ్ఞోపవీతము 27 పోగులు గలదయ్యెను. ఆసూత్రములే 27 భేదములుగల జగత్తు. ఆ జగద్రూపమగు యజ్ఞోపవీతమునే గాయత్రి

యని కర్మకాండ మనుష్ఠించుటకై ధరించు చుండిరి. పిమ్మట సద్గురునిచే, గాయత్రీ విచారణచేసి (ప్రపంచ విచారణ చేసి) ఆగాయత్రి యందలిమూడు తంతువులకు కూటస్థానమైనముడియే బ్రహ్మముడియనియు.నదియే అమలసత్వప్రధానయగు గుణసామ్యావస్థయనియు తెలిసియీప్రకృతి యజ్ఞోపవీతమును పరిత్యజించుటయే సన్యాసమనియు నతడే బ్రహ్మకాండననుష్ఠించువాడనియు నర్థము:— ఈరహస్యము తెలిసినవాడే జీవన్ముక్తుడు. బ్రహ్మముడియని చెప్పబడిన అమలసత్వప్రధాన యేబ్రహ్మమందులయమైయుండునో ఆపరబ్రహ్మమునకే మహాలింగమని పేరు.

ఇట్లే స్మృతి, శ్రుతులు బల్కుచున్నవి. ప్రకృతి నిరూపణము మొదలయినవి యీ దిగువ వివరింపబడినవి.

నిరాలంబోపనిషత్తునందు శ్రు॥ బ్రహ్మణస్సకాశాన్నానావిచిత్ర జగన్నిర్మాణ సామర్థ్యబుద్ధిరూప బ్రహ్మశక్తి రేవప్రకృతిః॥

పైంగలోపనిషత్తునందు శ్రు ఏకమేవాద్వితీయం బ్రహ్మ। తస్మిన్ మరుశుక్తికాస్థాణుస్ఫటికాదౌజల రౌప్య పురుషరేఖాదివల్లోహిత శుక్లకృష్ణ గుణమయీ। గుణసామ్యా నిర్వాచ్యా మూలప్రకృతి రాసీత్॥ గాన నామూలప్రకృతి తనత్రిగుణములచేత నానావిచిత్ర రూపములుగల జగత్తును సృష్టించెను.

తైత్తిరీయోపనిషత్తునందు శ్రు॥ అజామేకాం లోహితశుక్ల కృష్ణాం బహ్వీంప్రజాంజన యంతీగ్ంసరూపాం అజో హ్యేకోజుష మాణోనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోన్యః॥

తా. సూర్యకాంతి సూర్యునకు వేరుగానట్లు అమలసత్వ ప్రధానయగు మూలప్రకృతి పరబ్రహ్మమునందు గలదై ఆపర మేశ్వరుని యి

చ్ఛామాత్రింబున మలినసత్వ ప్రధానమై అధోముఖవ్యాప్తిగలిగిన త్రైత్రిగుణములచే తెలుపు, నలుపు, ఎరుపు వన్నెలుగల నానావిధరూపములుగల సృష్టినిచేసెను. సజాతీయ, విజాతీయస్వగత భేదశూన్యమై యుత్పత్తిలేనిదగు పరబ్రహ్మము ఆప్రకృతియందు ప్రవేశించి మగ్నమైయుండును. అనుభవించి విడిచిన భోగములుగల యీప్రకృతి సంబంధములేని వాడుత్పత్తిశూన్యుడై ప్రకృతికి విలక్షణుడై పరబ్రహ్మస్వరూపుడై యుండును.

భగవద్గీతావచనే ॥శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా । మామేవయే ప్రపద్యంతే మాయా మేతాంతరంతి తే॥

తా॥ ఈమాయ త్రిగుణస్వరూపిణి, నాసన్నిధానబలమున సకల ప్రాణులను నాయందు తన త్రిగుణములవలన కల్పించి వానియందు క్రీడించుచుండును, అస్మచ్ఛబ్దవాచ్యుడనైన నన్నెరిగి పొందువారు మాయనతిక్రమింతురనుట.

శ్రుతి॥ (నశిఖాంనవపనం కృత్వాబహిస్సూత్రం త్యజేద్బుధః) అని బ్రహ్మోపనిషత్తు కావున బహిస్సూత్రమనగా నాశనమగు బాహ్య ప్రపంచమును బోధించుటకు సూచనగా ధరింపబడు 27 పోగులుగల నూలుజందెమును త్యజించి

శ్రు॥ (బ్రహ్మసూత్ర మిదంజ్ఞేయంసూత్రం నామపరంపదం తత్సూత్రం ధారయేద్యోగి సవిప్రో వేదపారగః॥ అనియుండుటచేతను

శ్రు॥ (నంసూ్యతత్వాత్సమస్తేషువస్తుష్వ పిచసంతతం సూచనాత్పరమేశస్య సూత్రింలింగమితీరితం॥ యదక్షరం పరంబ్రహ్మతత్సూత్రమితిధారయేత్ ధారణాదస్యసూత్రిస్యనోచ్ఛిష్టం నాశుచిర్భవేత్

కూర్మపురాణే॥ అలింగమేక మవ్యక్తంలింగం బ్రహ్మేతి నిశ్చితం స్వయంజ్యోతి పరంతత్వం పరవ్యోమ్ని వ్యవస్థితమ్ తదక్షరంపరం జ్యోతి స్తద్విష్ణోఃపరమంపదం॥ అనుటచే జంగమాజంగమమైన సర్వ పదార్థములయందు సంతతము సచ్చిదానందములచే చేరికొనియుండుట చేతను పరమేశ్వరునకు సూచకముగా నుండుటచేతను బ్రహ్మమనబడు లింగమే అంతస్సూత్రమనబడును ఆఅంతస్సూత్రమనబడు లింగమును ధరించవలెను.

సన్యాసాశ్రమమునందు నూలుజంధెమును విసర్జించినట్లు యేయాశ్రమమునందును లింగమును విసర్జించకూడదు ఎందుచేతననగా త్యజించవలసిన ప్రపంచవిచారణతో కూడిన బహిస్సూత్రమగు నూలుజంధెమును విసర్జించుటకు సన్యాసాశ్రమమునుపొంది జంధెమును విసర్జించి పిమ్మట త్యజింపదగని బ్రహ్మమగు అంతస్సూత్రమైయుండు లింగమునుధరించుటకు శ్రు॥ తుర్యాశ్రమంతు సన్యాసంపంచమం లింగధారణం అనిచెప్పబడిన సన్యాసాశ్రమమున కతీతమగు లింగధారణాశ్రమమునుపొంది ధరించినదగుటచే లింగమును ఎన్నడువిడువరాదు. సన్యాసాశ్రమముకన్న లింగధారణాశ్రమము అతీతమనుటకు ప్రమాణము

స్కాందపురాణే॥ శంకరసంహితాయాం॥

శ్లో॥ క్రిమికీటపతంగేభ్యః పశవః ప్రజ్ఞయాధికాః పశుభ్యోపినరా శ్రేష్ఠాస్తేషు శ్రేష్ఠాద్విజాతయః ద్విజాతిష్వధికావిప్రావిప్రేషు క్రతుబుద్ధయః క్రతుబుద్ధిషుకర్తారస్తే భ్యస్సన్యాసి నోధికాః తేభ్యోవిజ్ఞానినశ్శ్రేష్ఠాస్తేషు శంకరపూజకాః తేషు శ్రేష్ఠామహాభాగ మమలింగాంగసంగినః లింగాంగసంగిష్వధికష్షట్స్థలజ్ఞానవాన్పుమాన్ తస్మాదభ్యధికోనాస్తి త్రిషులోకేషుసర్వదా॥

తా॥ క్రిమికీటపతంగములకంటే పశువులధికము. పశువులకన్న నరులధికము నరులలో ద్విజులధికులు ద్విజులందువిప్రులధికులువారికన్న క్రతుబుద్ధులధికులు ఆక్రితుబుద్ధులుకన్న క్రతుకర్తలధికులు వారికంటే సన్యాసులధికులు వారికంటేజ్ఞానులధికులు జ్ఞానులకంటే శివార్చనజేయువారధికులువారికంటే లింగాంగసంగులధికులువారిలోషడ్థ్సలజ్ఞానులధికులు వారికిసమానులు త్రిలోకములందునూలేరు భక్తమహేశ్వరప్రసాద ప్రాణిలింగశరణైక్యస్థల విచారణపరులు షడ్థ్సలజ్ఞానులు లింగము బ్రహ్మమెట్లయినదనగా?

శ్లో॥ లయంగచ్ఛతియత్రైవ జగదేతచ్ఛరాచరం పునఃపునస్సముత్పత్తిం తల్లింగంబ్రహ్మశాశ్వతం॥

భగవద్గీత॥ మయ్యేవసకలంజాతంమయిసర్వంప్రతిష్ఠితం। మయిసర్వంలయంయాంతి తద్బ్రహ్మాస్మ్యహమద్వయం॥ అని

మహావాక్యరత్నావళిశ్రు॥పశ్యంతితత్పరం బ్రహ్మమత్తల్లింగమితిశ్రుతిః॥

(లీనమర్థంగమయ తీతిలింగం)

శ్లో॥ లియ్యతేగమ్యతేయత్ర యేనసర్వ చరాచరం।

తదేవలింగ మిత్యుక్తం మితివేదాంత డిండిమః॥

అని అమరసంహితాదుల లింగాన్వయము

(రుద్రయత్తేజనిమ,చారుచిత్రం) అని యజుర్వేదవచనము.

(లింగరూపిణం మాగారం సంపూజ్యచింతయంతి యోగినస్సిద్ధాః) భస్మజాబాలోపనిషత్తు

(లింగరూపీ మహేశ్వరః) పురాణవచనము. అనెడి ప్రమాణములచే నేవస్తువుసందీ చరాచరాత్మకమైన జగత్తులీనమై పునః ఉత్పత్తియగునో ఆవస్తువే లింగమను పేరుగల పరబ్రహ్మము. అందువలన

పరబ్రహ్మమే మహాలింగము, ఆమహాలింగమే పరబ్రహ్మమని యభి ప్రాయమాయెను. కాని

శ్రుతి॥ అశరీరంశరీరేష్వనవ స్థేష్వవ్యవస్థితం

శ్లో॥ బ్రహ్మణోలింగరూపత్వమయుక్తమితిచేచ్ఛృణుఆత్మాయన మఃఆరభ్యలింగశబ్ద పరంపరా ప్రసిద్ధా తైత్తిరీయోపనిషద్యేవప్రదర్శ్యతే లింగశబ్దస్యనాన్యోర్థః కల్ప్యస్స్వశనతశ్శృతేః॥ బ్రహ్మమశరీరమనియు శరీరాభిమానిజీవుడనియుయున్నది గనుక బ్రహ్మమునకు లింగరూపత్వముకూడదనిచెప్పతగదు ఎందువల్లననగా ఆత్మాయనమః ఆత్మలింగాయనమఃఅనియారంభించి పరంపరగలింగశబ్దము తైత్తిరీయోప నిషత్తునందు కానవచ్చుటచేతశ్రుతి సంబోధిమైనలింగశబ్దమునకునన్యార్థకల్పనముసరసముకాదు గనుక లింగమనగా బ్రహ్మమనినిశ్చయింపబడినది (యీవివరముముందు వ్రాయబడును)

గనుకనిట్టిపరబ్రహ్మమగులింగముధరించవలెననుటకుప్రమాణము ఋగ్వేదె పవిత్రంతే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః అతప్తతనుర్నతదామో శ్నుతే శ్రితాసఇద్వహంతస్తత్సమాశత॥

తా॥ ఓవేదములకు ప్రభువైన పరశివా ప్రపంచమునకు నిగ్రహానుగ్రహాది సమస్త వ్యాపారములందును సమర్థుడవగు నీవు బ్రహ్మాదిశరీరములయందు వ్యాపించియున్నావు. నీవు సర్వవ్యాప్తివలన విస్తారమైయున్న లింగమువుఅశుచి దోష పరిహారకమై నట్టియు, కృఛ్రాదివ్రతములవలన తప్తమైన శరీరములేని కారణమున అపక్వప్రాదయుడైన వాడు ఆలింగమును ధరించుటలేడు. శివధర్మము నాశ)

యుంచినట్టివారు ఆలింగమును వహించినట్టివారై చక్కగా శివపదప్రా ప్తి సుఖమను భవించెదరు.

శ్లో॥ బ్రహ్మేతిలింగమాఖ్యాతం బ్రహ్మణస్పతిరీశ్వరః పవిత్రం తద్ధి విఖ్యాతం తత్సంపర్కాత్తనుశ్శుచిః॥ బ్రహ్మమనగాలింగముదానికి అధిపతియగుటచే బ్రహ్మణస్పతియని యీశ్వరుడు ప్రఖ్యాతుడైయు న్నాడు అందువలన లింగశబ్దము ధారణమైన లింగమునకుగాని వేద మూలమైన ప్రణవమునకుగాని దానికర్థమైన లింగశరీరాభిమానియగు హిరణ్యగర్భునకుగాని పరబ్రహ్మమునకుగాని బోధకమైనది. కావున ఇ ట్టి పరశివ పరబ్రహ్మవాచ్యమైన లింగమును మడిమయిలలయందును శుచ్యాశుచులందును ధరించుటకు యోగ్యమైనది. ఈఅర్థమే ఉపబ్రుం హణ వచనములందు గలదు. ఆఉపబృంహణ వచనములకుప్రామాణ్య మెట్టిదనిన? వేదములకు పురాణేతిహాసములు వ్యాఖ్యానమగుటచేతను

శ్లో॥ యశ్శ్రుతుర్వేదవిద్విప్రః పురాణంవేత్తినార్థతః తంద్రుష్ట్వా భయమాప్నోతి వేదోమాం ప్రతరేదితి॥ సూతసంహితావచనాత్॥

శ్లో॥ ఇతిహాసపురాణాభ్యాంవేదార్థముపబృంహయేత్ బిభేత్య ల్పశ్రుతాద్వేదోమామయంప్రతరేదితి॥ మహాభారతవచనము

తా॥ నాలుగువేదములు తెలిసిన యేబ్రాహ్మణుడర్థవంతముగ బురాణాదులను తెలియజాలడోవానిని జూచివేదమునన్ను నీవువంచించె దవని భయపడునని సూతసంహితావచనము ఇతిహాసపురాణములచే వేదముయొక్క యర్థమును వివరించవలసియుండగ అన్యథావీకునన్ను వంచించునని స్వల్పశాస్త్రజ్ఞునిగురించి వేదము భయపడునని మహాభార త వచనము కావున వేదముయొక్కఅర్థమును ఉపబ్రుంహణ వచనము లచే గ్రహించనగును

మూ॥ ఋగ్వేదే॥ పవిత్రం తే॥ వితతం బ్రహ్మణస్పతే॥ తస్మాత్పవిత్రం తల్లింగం॥ ధార్యం శైవమనామయం॥ అతప్తతనుర్నజ్ఞో వైశివసంస్కారవర్జితః॥ దీక్షాయారహితస్సాక్షాత్॥ నాప్నుయాల్లింగముత్తమం॥ యః కరోతి తపః పూర్వం॥ సతప్తతనురుచ్యతే॥ పరిపక్వోవిమోక్షాయ॥ సోఽశ్నుతేలింగధారణం॥ నకరోతితపః పూర్వం॥ సతప్తతనురుచ్యతే॥ అపక్వోయం న మోక్షాయ॥ నాశ్నుతే లింగధారణం॥ శివధర్మాశ్రితాశ్శాంతా॥ శివార్చనపరాయణాః॥ యే వహంతస్సదాలింగం॥ తే యాంతి పరమంపదం

తా॥ బ్రహ్మమునలింగము దానికధిపతియగుటవలన యీశ్వరుడు బ్రహ్మణస్పతియని ప్రఖ్యాతుడైయున్నాడు. సంబంధమాత్రముచే దేహమున శుద్ధి పొందించుటవలన లింగము పవిత్రమైయున్నది. వ్యాపకభావముచేనంటునుగనుక లింగము ధార్యమగును. గురూపదేశముచే విషయవైరాగ్యముకలవాడగును ఈసంస్కారము లేనివాడు అపక్వహృదయుడు.

శ్లో॥ దీయతేజ్ఞాన సంబంధః క్షీయతేచమలత్రియం అనువృత్త్యా దీక్షేతి. శైవసంస్కారము దీక్షయనబడును ఇదిలేనివాడు సాక్షాత్తుగా లింగమును పొందజాలడు ఎవడుపూర్వమునందు తపముచేయునోవాడు తప్తతనుడు ముక్తికిసాధనమైన లింగమును బొంది శివధర్మము నాశ్రయించి శమదమాది సంపన్నులయి శివార్చనజేయుచు నెప్పుడును లింగమును ధరించినవారు పరశివస్థానమును బొందుదురని తైత్తిరీయోపనిషత్ యుపబృంహణవచనముల యర్థము. కాన లింగధారణము వేదప్రసిద్ధము.

యజుర్వేదే॥ రుద్రైకాదశిన్యాం॥ యాతేరుద్రశివాతనూరఘోరాపాపకాశినీతయా నస్తనువాశంతమయాగిరిశంతాభిచాకశీః అస్యార్థః॥ రుదం రోదనం సంసారదుఃఖజనితం ద్రావయతీతి రుద్రః, రుద్రమజ్ఞానం ద్రావయతీతి వారుద్రః హేరుద్ర అఘోర, శాంతా, శారా, శి, మంగళ

ప్రదా,యా తేతనూః,లింగరూపశరీరం,సా,అపాపకాశినీ, అపాపేషు,పాప
రహితేషు, కాశితఇత్యపాపకాశినీ,త్యర్థః॥లింగరూపశరీరావచ్ఛిన్నశ్శివః
శమదమాదిసంపన్నభక్తగాత్రే ధార్యఇతివర్యవసితోర్థః తతశ్చజాగ
రూకేత్యనుసంధేయమ్।అథవా, హేరుద్ర, తే,తవ, శివా, నిర్దోషత్వేన
నిరతిశయ కల్యాణ గుణాకరత్వేన, చశివంకరత్వేన చ, ప్రసిద్ధాయాత
నూః, లింగంతు, శివయోర్దేహోయిత్యాగమవాక్యాల్లింగరూపి
ణమూర్తిః అఘోరా,శివయోగ్యేవ హృదయంగమా, కిం
చఅపాపా, శివదీక్షయావిగతకల్మషాః అథవా అనేక జన్మ
సిద్ధానాం శ్రౌతస్మార్తానువర్తినాం, నరాణాంక్షీణపాపానాం శివభక్తి
ప్రజాయతే। ప్రసాదాద్దేవతాభక్తిః। ప్రసాదోభక్తిసంభవః। యథై
వాంకురతోబీజం। బీజతోవాయథాంకురః ఇత్యాది వచనప్రామా
ణ్యాద్బహుజన్మకృత్యైఃపుణ్యైఃప్రక్షీణఃపాపసంజరాః॥ఏకేచనసంతితఏవ
అపాపా ఇత్యర్థః। అపాపేషు, భక్తేషు, కాశినీ, ఇష్టప్రాణ భావలింగ
రూపేణ సుప్రకాశినీత్యర్థః। గిరిశంత,గిరా,కైలాసేశం,స్వోపాసకానాం
నిరతిశయానందస్వరూపం సుఖంతనోతీతిగిరిశంతః హేగిరిశంత శంత
మయా సుఖతమయా తయా లింగస్వరూపయాతనువాశరీరేణనః
అస్మాకం అభిచాకశీః సంసారనిమిత్తం పుణ్యపాప సంచయః ప్రణుద్య
సాక్షాత్ప్రకాశ స్వేత్యర్థః। అత్రోపబృంహణ వచనాని। స్కాందే॥
లింగం శివాతనూఃప్రోక్తా। మూర్తిర్ఘోరతనూస్మృతా। అపాపేషు
చభక్తేషుతయోర్మధ్యే శివాతనూః। కాశతే పరమేశస్య శిష్టాస్తే
లింగధారిణః। అఘోరా పాపకాశీతి। యాతేరుద్ర శివాతనూః।
యజుషాగీయతేయస్మాత్తస్మాచ్చైవోఘవర్జితః నిత్యంభాతి తదంగేషు
యాతేరుద్ర శివాతనూః అఘోరా పాపకాశీతి శ్రుతిరాహ సనాతనీ
కించ-హరదత్తాచార్యకృతే చతుర్వేద తాత్పర్యసంగ్రహే

శ్లో॥ అపాపకాశీతివపుశ్శ్రుతం తే ॥ శిష్టాః ప్రసిద్ధాః భగవన్నపాపాః। అతస్త్వదీయానపహాయ భక్తానన్యాన శిష్టా ఇతి నిశ్చినోమి ॥

నీలకంఠాచార్య మంచణపండిత మాయిదేవ ప్రభృతులు తమ తమ భాష్యములలోనిదే యర్థము వ్రాసియున్నారు. తా॥ సంసార జనితదుఃఖమును, అందుకుమూలమైనఅజ్ఞానమున్నూ పోగొట్టుటవలన నీశ్వరునకు రుద్రుడని పేరువచ్చినది. వాక్కునందు కైలాసమునుండి నిరతిశయమైన సుఖమును భక్తులకు నొసంగుట వలన గిరిశంతుడని యీశ్వరుడు చెప్పబడును. సజ్జనులకు భయంకరము కానందున అఘోరమనియు సుమంగళప్రదుడగుటవలన శివయనియు ప్రసిద్ధమైయున్న నీ శరీరము పాపరహితులైనవారియందు ప్రకాశించుచుండుటచేత అపాపకాశిని అని చెప్పబడును. నిత్యస్వరూపమైనదనుటచే శంతమయియున్న యాశరీరముచేత మాకొఱకు ప్రకాశింపుచున్నాడవని యర్థము. లింగరూపమైనశరీరము చే కూడిన శివా! నీవు అంతఃకరణ బాహ్యేంద్రియనిగ్రహాది గుణములచే కూడిన భక్తుల శరీరమందు ధార్యుడవైనవాడవు హంసోపనిషత్తునందు శ్రు॥ హృదబ్జమధ్యే లింగం ధృత్వా జ్యోతిషి సంవిశంతి॥ అత్యాశ్రమస్థాః పరిముచ్యంతి। సర్వే లింగాంగ శోభా మోక్షమార్గైకనిష్ఠాః బ్రహ్మలోకేషు పరాంతకాలే శివప్రసాదాత్పరిముచ్యంతి। సర్వే లింగాంగ సామరస్యాశ్చ శరీరే లింగధారణాత్ నియమేనైవ ధృత్వా తే ముక్తా సంసార బంధనాత్॥

తా॥ హృదయకమలమధ్యమందు జ్యోతిర్మయమైన లింగమును ధరియించి లింగాంగ శోభితులై మోక్షమార్గైకనిష్ఠులైనఅత్యాశ్రమస్తులు శివప్రసాదముచే సమస్త పాపవిమోచనులై యంత్యమందు బ్రహ్మలోకము నొందుదురు లింగాంగ సామరస్యముగు శరీరమందు

నియమముచేత లింగము ధరించినట్టివారు సంసారము వలన ముక్తు
లగుదురు.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు శ్రు॥ సర్వాననశిరోగ్రీవానర్వ
భూతగుహాశయః । సర్వవ్యాపీచ భగవాన్తస్మాత్ సర్వగతశ్శివః॥

ఈ శ్రుత్యర్థము లింగధారణమును ప్రతిపాదించుచున్నది.
సామవేదే ॥శ్రు॥ ఓంనమో బ్రహ్మణేధారణంమే అస్త్వనిరాకరణం
ధారయితా భూయాసం। కర్ణయోశ్శ్రుతం మాచ్యోఢ్వంమమాము
ష్యఓం॥ అస్యార్థః। నమోబ్రహ్మణే బ్రహ్మణస్పతిరీశోయం బ్రహ్మేతి
ల్లింగముచ్యతే । ఇతిస్కాందవచనేన॥ అలింగమేక మవ్యక్తం లింగం
బ్రహ్మేతినిశ్చిత, మితీశ్వర గీతావచనేన "బహ్మణేలింగ మూర్తయే"
ఇతిలింగ పురాణవచనేన " జ్యోతిరూపే పరోక్షేలింగాఖ్యే బ్రహ్మరూ
పే"ఇత్యపరాధస్తోత్రే శంకరాచార్యవాక్యేనచ"బ్రహ్మణేలింగమూర్త
యేనమః " ఇతి పురుషైర్న మస్కారభక్తి పురస్సరం లింగ
ధారణం యాచితం ధారణం తద్బ్రహ్మరూప శివలింగ ధారణం
మేమమ అస్తుభూయాదనిరాకరణం । శ్లో॥ ఉత్తమాంగేగళేవాపికక్షే
వక్షస్థలేపివా । తథాహస్తతలేవాపిపాణిలింగంధరేత్సుధీః॥ గచ్ఛంతి
ష్ఠన్స్వపన్ జాగ్రన్నిమిషన్నిమిషన్నపి । శుచిర్వాప్యశుచిర్వాపిలింగం
సర్వత్రధారయేత్ ।ఇతికామికాగమవచనప్రామాణ్యాత్స్వంచ నుస్థానేషు
కదాచిదప్యజహానం మాస్తుమాభూత్ ।ఓంఓంకార పదవాచ్యంలింగం
తద్ధారయితా భూయాసమితిశ్రుతిః స్వోక్తం తాత్పర్యం ముముక్షూణాం
లింగధారణ మామేడితమాహకర్ణయోశ్శ్రుతం వేదశాస్త్రపురాణేషు
ప్రసిద్ధం । అథవామననాత్త్రాయతే యస్మాత్తస్మాన్మంత్రోయమీరితః
వాచ్యవాచక రూపేణ ద్విధామంత్రః ప్రకీర్తితః । వాచకోవర్ణ
రూపస్స్యాద్వాచ్యస్తుపరమశ్శివః । మనుదేవత యోరైక్యం తస్మాదా

పాపర్మ హర్షయః । ఇతివచనాద్గురూపదిష్టశ్రుతి ప్రసిద్ధ శివమంత్ర
రూపం । అముష్యమమ సర్వదాజపతత్పరస్య వాచికమానసికోపాంశు
భేదైః ఊర్ధ్వంపాహ్యం అస్తుభూయాత్ । అచ్ఛప్రమాదేన మా
భూదిత్యర్థః । ఇత్యేవంప్రాయశ్చిత్త రహితానాం లింగలోపే మంత్ర
లోపేపిచ లింగైక్యానుసంధాను రూపప్రాణత్యాగ ప్రతిపాదకా నా
మాగమవచనా నామియమేవశ్రుతి ర్మూలమిత్యవగంతవ్యం॥ అత్ర న
మస్తేబ్రహ్మణే తుభ్యమాచార్యాయ మహాత్మనే । తన్నిరాకరణం వి
శ్వంజన్యత్వాన్మృత్యునైవహి అనిరాకరణం బ్రహ్మ । కారణ త్వా
చ్చిరంతనం అనిరాకరణంమేస్తు ధారణం చేశికోత్తమ । వేదశాస్త్ర
పురాణేషు ప్రసిద్ధంకర్ణయోశ్శ్రుతం ॥ అహంధారయితా దేవం భూ
యాసంసర్వకారణం బ్రహ్మవిష్ణ్వాదయో దేవాః ప్రసిద్ధాశ్చస్తథాశ్రు
తాః । తేనిరాకరణాస్సర్వే మృత్యునాసర్వశత్రుణా మనిరాకరణాస్త్వే
తి । నహిధార్యాఃకదాచన । నాహంధారయితా దేవాన్ । భూయాస్సం
మజ్జతస్సురాః నశక్నువంతిమాంత్రర్తుం। మజ్జంతంమృత్యుసాగరే।ఊర్ధ్వం
మమేదమోంలింగం, మాచ్చాముష్యసమాశ్రయే । కించటమితి బ్ర
హ్మపరమంలింగాకారంమహేశ్వరం॥ సర్వావస్థాసుసర్వేషు కాలేషునిమి
షార్ధత॥ అవియోగేనభుక్తించ ముక్తిమిచ్ఛన్ ద్విజోత్తమః । ధారయే
త్పంచసుస్థానేష్వస్మిన్ సంలగ్నమానసః । ఉపదిష్టంచగురుణా । కణ్ఠే
తం దివ్య రూపభాక్ । వేదసిద్ధంమంత్రరాజం । జపేత్పంచాక్షరంసదా
। అస్మిన్నర్ధేధారయితా । భూయాసమితిహిశ్రుతిః । హస్తసింహాసనే
లింగమప్రమాదేనధారయేత్ ।ప్రమాదాత్పతితేలింగేః సహప్రాణాన్
పరిత్యజేత్ పతితేప్రాణలింగేయః ప్రాణాన్ధత్తేవరాధమః సచండాల
ఇతిజ్ఞేయ స్సర్వకర్మ బహిష్కృతః । లింగపాతిసమాచార నిందకం
సహృది స్మరేత్ । వీరశైవ క్రమం ప్రోక్తం ప్రాయశ్చిత్తాది వర్జితం ।

శుద్ధశైవోపి శేషేణ మంత్రతంత్ర ప్రచారణాత్ । శుద్ధోభవతిలోపే ష్వప్రాయశ్చిత్త విధానతః । ప్రాణలింగ వ్రతేలుప్తే ప్రాయశ్చిత్తం నవిద్యతే । ప్రాణత్యాగాత్పరం తస్మాత్సావధానే నధారయేత్ సంస్కృత్య గురుణాదత్తం షడధ్వన్యాసపూర్వకం వామహస్త తలే లింగం సావధానే నపూజయేత్ । ఇత్యాదీని బ్రహ్మాండపురాణశంకరసంహితా వాతూలాగమమాద్యుప బృంహణవచనానిబహూనిసంతి॥

తా॥ ఓంనమో బ్రహ్మణే అను మంత్రమునకు బ్రహ్మము లింగమై యుండుటవలన దానికి పతియైన యీశ్వరుడు బ్రహ్మణ స్పతి యని చెప్పంబడునని స్కాందవచనము. అలింగము, అవ్యక్తము, లింగము బ్రహ్మమని గీతావచనము తేజోరూపముగా అపరోక్ష భావముతోనున్నట్టి లింగమను పేరుగల బ్రహ్మమందని శంకరాచార్య వచనము లింగస్వరూపమయిన బ్రహ్మకొఱకు నమస్కారమని లింగపురాణవచనము వీనివలన బ్రహ్మపదము లింగబోధకమైనది. లింగరూపమైన పరబ్రహ్మము కొఱకు నమస్కారము శిరస్సు, కంఠము, కక్షము, ఉదరము, హృదయము, హస్తమూలము వీనియందెచ్చటనైన నను ఓంకారవాచ్యముగానున్న లింగరూపమైన నిన్ను ధరించెదను, నాకపుడు నిరాకరణములేక ధరించునట్టి వాడనగుదును. శ్రవణమార్గమున జెప్పంబడిన మంత్ర మెద్దియో ప్రమోదముతో గ్రహించి విడువను ఇట్టినేను జపాదులతో మంత్రము వహించుటకు శక్తియుక్తుడనని యర్థము దీనివిశేషార్థము చెప్పుచున్నాను. తిరుగునపుడు కూర్చున్నపుడు, సలిచినపుడు, నిద్రించునపుడు, మేల్కొనునపుడు, ప్రాతస్సంధ్యలందు, శుచ్యశుచులందుసర్వదాలింగమునుధరించుకొనవలెనుఅని ఆగమవచనము ఈరీతి మంత్రము భక్తునిప్రార్థనాక్రమమును బట్టి తనకు లింగధారణయందే ముఖ్యతాత్పర్యమున్నదని తెలిసికొనుటకు మరల మరల

5

చెప్పబడినది. (ఆమ్రేడితం ద్విస్త్రిరుక్తం) అని అమరము చెప్పునుగాన పునః పునః చెప్పబడినదని యర్థము వేదములందును శాస్త్రములందును పురాణములందును నేకరీతిగా మంత్రము చెవిలోనే చెప్పవలయు ననుటచేత ప్రసిద్ధమైనది. లింగధారణము అనేకావృత్తిగా గూడ దనియు శ్రుతియొక్క తాత్పర్యము మంత్రావృత్తియందున్నదని వాద పక్షమును గ్రహించి అథవాఅని చెప్పబడినదని తెలియదగినది. మంత్ర ముయొక్క యర్థమును భావించుటే మననమగును ఇట్లు చేయుట వలన రక్షించునని యర్థముగాన మంత్రమేయని చెప్పబడును మంత్రము వాచ్య వాచకముల భేదములచేత రెండువిధములుగా జెప్పబడును వీని యందు వాచకమైనది వర్ణరూపము వాచ్యమైనది పరశివరూపము అందు వలన మంత్రదేవతలకు భేదములేదని మంత్రసాక్షాత్కారముచే ఋషు లని ప్రసిద్ధులయిన తాపసులయందు మహాత్ములైనవారు చెప్పుదురు. ఇందువలన గురూపదిష్టమైనట్టి శ్రుతిప్రసిద్ధమైన పరశివుని మంత్ర రూపమైన లింగము తనకు చెప్పినట్లే యుచ్చరించునది వాచకము తాను మాత్రము వినినట్లు చెప్పునది ఉపాంశువు. ముఖముచేత నుచ్చ రించునదే మనస్సుచేత భావించునది మానసికము అను మూడు విధ ములైనజపములచేతనుధ్యానముచేతను వహించుటకుయోగ్యమయినది. ఇచ్చట మఱువరాదని యర్థము ఉపాధివిశేషముచేత మంత్ర విస్మృతి యైనపుడుమఱలయుపదేశమైవిశేషపూజాదులందుకరస్థలమందున్నలింగ మువాతాదివికారములవలనస్ఖలితమైనచో దిరిగిఈమంత్రముచేత నేదాను స్వీకరించుట విశేషమని తలంచిన లింగనాశనమందు ప్రాయశ్చిత్తము, ఇతరలింగధారణముగూడ విదితముగాదు, లింగాత్మైక్య సంధానముచే ప్రాణత్యాగమే విహితమైయుండుటచే ఇష్టప్రాణలింగములకు భేదము లేదని తెలియదగినది. ఈ మంత్రార్థము స్వకల్పితము గాదనుటకు

మంత్రివ్యాఖ్యా రూపమైన పురాణాగమాది శ్లోకములందు నమస్తే అనునది మొదలుగ నుదాహృతమైయున్నది. పరశివ స్వరూపముచే లింగాంతర్వర్తివైన నీకొఱకు నమస్కారము. శివతత్వ జ్ఞానమువలన మహాత్ముడవై యాచార్యరూపముచేనున్న నీకొఱకు నమస్కారము. జననమరణాదులచే ప్రపంచము నిరాకరణమైనది. ఇందుకతీతమై యిందుకే కారణమగుటవలన పురాతనమైన బ్రహ్మము అనిరాకరణమైనది. ఓగురువరా ! అనిరాకరణుడైన పరశివునకు స్వరూపమగుట వలన అనిరాకరణమైన లింగమున్ను దానియొక్క మంత్రముసహా నాకు ధార్యమాణమై, వేదశాస్త్ర పురాణములందు ప్రఖ్యాతముగా శ్రవణగోచరమైన సర్వప్రపంచమునకు కారణుడైన పరశివుని నేను ధరించినవాడనైతిని. అట్లగుటచే ముఖ్యప్రతులైన బ్రహ్మవిష్ణ్వాది దేవతలందరు సర్వశత్రువైన మృత్యువుచేత నిరాకరణులైయున్నారు. అందువలన వారునాకు ధార్యమాణులుగారు. ప్రళయమందున మునుగునట్టి వారిని ధరింపనొల్లను. ఈ దేవతలు సంసార సముద్రమందు మునిగెడు నన్ను దాటింపజాలరు.

ఈ ఓంకార వాచ్యమైన లింగమున్నూ తత్సంబంధమైన మంత్రమున్నూ ఒక్కబ్రహ్మమునకే చెందియున్నవి. గావుననాకు వహించుట కవశ్యకమయియున్నవి. భుక్తి ముక్తివిషయముల నిచ్చగించు ద్విజోత్తములకు విష్ణు, రుద్ర, బ్రహ్మ పరశివబోధకమైన అకారోకార మకారార్ధ మాత్ర స్వరూపముచే నుండుటవలన ఓం అనియు సర్వవ్యాపక భావముచే బ్రహ్మమనియు, సర్వోత్తమ భావముచే పరశివుడనియు ప్రసిద్ధమైనట్టి లింగరూపమైన మహేశ్వరుని మస్తకము మొదలైన అయిదు స్థానములందొక స్థానమునందు జాగ్రదాద్యవస్థలందున్నూ సర్వకాలమందున్నూ తదేకాయత్తచిత్తులై

ధరించవలెను. గురువులచేనుపదిష్టమై వినబడినట్టి వేదప్రసిద్ధమైనట్టి పంచాక్షరీమంత్రరాజమును శివధ్యానాసక్తుడగుటచేనిర్మలస్వరూపుడై సర్వదా జపింపవలెను. గురూపదేశమైన మంత్రమే జపించుటయేలయనగా శ్రీకృష్ణుడర్జునునకు గీతలో చెప్పుటలో రథాగ్రమందున్న హనుమంతుడు విని కృతార్థుడనైతినని నమస్కరించినపుడు పరోద్దేశముచే చెప్పిన తత్వార్థమును గ్రహించిన వాడవగుటచే నీవు పిశాచమగుదువని శపించి మరల శరణాగతుడైన హనుమంతున కీవ్యాఖ్యానముచే నీవు కృతార్థుడవగుదువని కృష్ణుడు వరమొసంగెననునదిలోకప్రసిద్ధమై యుండుటవలన మార్గాంతరముచేత మంత్రము గ్రహించినప్పటికి నిది తెలిసికొనుటకు గురూపదిష్టంబని చెప్పంబడియున్నది "వశకాంతౌ" అను ధాతువుచేత శివశబ్దము సిద్ధమైయుండుటచేత యీ మంత్రము మంత్రరాజమైయున్నదని తెలిసికొనదగినది. దీనికి బ్రతిపాద్యుడగు పరశివుడే స్వరూపజ్ఞానమునకు సాధనముగా నాపరమాత్మని పూజకు స్థానమగుటవలన శిలామయమైన లింగము ధార్యమై యున్నది. అది కారణముగా ధారణమందు శ్రద్ధాభక్తులు గల భక్తునిప్రార్థనావాక్యమును వేదము "ధారయితా భూయాసం" అని చెప్పబడినదని తెలిసికొనవలెను. హస్తమను సింహాసనమందు జాగ్రత్తతో లింగమును ధరించవలెను. ప్రమాదము వలన లింగము లోపమయినపుడు తోడనే ప్రాణములు విడువవలయును. ప్రాణలింగము పోయినమరల ప్రాణముధరించునరాధము నిసర్వకర్మబహిష్కృతుడగు చండాలుడని తెలిసికొనవలెను. ఇట్టి యాచార దూషకుని మనస్సునందు స్మరించగాదు. ప్రాయశ్చిత్తము న్నూలేదు. వీరశైవులని శుద్ధశైవులని రెండు భేదములయిన శివభక్తులందు శివజీవైక్య జ్ఞానులు వీరశైవులు, శివ సర్వోత్తమ భావముచేత వంశసంభవులయిన జీవులు శుద్ధశైవులు, వీరశైవులకు లింగలోపమయి

నప్పుడు ప్రాణత్యాగమే ప్రాయశ్చిత్తమైయుండుటచే వీరశైవుడే కాగల భావముచే ధరించవలెను. శుద్ధశైవుడీ లోపమునందు। మంత్రి, తంత్రి, పరిచారణాదిరూపమైన ప్రాయశ్చిత్తముచే శుద్ధుడగును. దీక్షాది సంస్కారమును గావించుకొని గురువులన షడధ్వన్యాసపూర్వకముగా నొసగబడిన లింగమును వామహస్తమందుంచుకొని యనన్య భావముచే బూజింపవలయును.

అథర్వణ వేదమందు శ్రుతి: ఇష్టమూర్ధ్వంత పసామసుచ్ఛ॥తిఅస్మి న్నర్థే వాతూలాగమే" సకల దృక్కలాగ్రాహ్యమిష్ట లింగస్థలం మహత్" ఇష్టావాప్తికరం సాక్షాదనిష్టపరిహారకం ఇష్టమూర్జం స్వభక్తానామసు యచ్ఛతి సర్వదా। ఇష్టలింగమితి ప్రాహుతస్మాదాథ ర్వణీశ్రుతి:॥

తా॥ జ్ఞానగురువు వలన గలుగు జ్ఞానముచే భక్తుడుచేయు సత్క్రియ యేవస్తువునందు లీనమగునో ఆవస్తువే క్రియాలింగము ఇష్ట లింగమని భావము పరంజ్యోతిస్వరూపమైనపరబ్రహ్మమే క్రియాలింగము అథవా ఇష్టలింగమైయున్నది. ఆలింగమునుబూజించుటచే సమస్తసత్క్రి యలచే గలుగు ఫలము లభించును, గాన ఇష్టలింగమునభేదబుద్ధిచే నర్చింపుడను అథర్వణ శ్రుత్యర్థమును వాతూలాగమ వచనము వ్యక్త పరచుచున్నది.

మూ॥ సర్వమన్య త్పరిత్యజ్య శివాదన్యంతుదైవతం శివయేవ సదాపూజ్యో ముముక్షు భిరహర్నిశం॥ అయమేవహిసిద్ధాంత స్సర్వ వేదేషునాన్యథా। తస్మాల్లింగం బ్రహ్మశైవ ముపాస్యంచ ముముక్షు భి:॥ లింగాంగ సామరస్యేన జీవబ్రహ్మైక్యలక్షణం। కైవల్యమేవసర్వే షాంజాయతే నపునర్భవ:॥ తా॥ ముముక్షువులయినవారు ఇతరము

లయిన కార్యముల నన్నిటిని శివభిన్నమయిన మతములన్నిటినివిడచి రాత్రింబవళ్ళు శివపూజచేయవలెను. సమస్తవేదములకున్నూ యిదే సిద్ధాంతము గాని మరియొకటికాదు. అందుచే బ్రహ్మ మనబడు శైవ లింగము ముముక్షువుల వలన లింగాంగ సామరస్యముచేనుపాసింపబడు చున్నది. వారికి జీవబ్రహ్మైక్య లక్షణమయిన కైవల్యము కలుగును గాని పునర్జన్మము కలుగదు.

నీలకంఠ శివాచార్య రచితబ్రహ్మ సూత్రార్థ ప్రతిపాదక వీర శైవ భాష్యకారికయందుకూడ నట్లే జెప్పబడియున్నది.

సూ॥ లింగాంగ సామరస్యైక లభ్యంపాశవిమోచనం। శివ ఏవ పరంతత్త్వం శివఏవ పరంమహః। శివఏవ పరంజ్యోతి శ్శివఏవ పరా త్పరః । వ్యాసోక్తం యత్పరం బ్రహ్మసూత్రేషు సశివస్స్వయం । శివ ఏవహిలింగంచ లింగరూపీ శివస్స్వయం । సర్వవేదాంత వాక్యానాం ప్రతిపాద్యశ్శివస్స్వయం । సర్వతత్త్వావలంబశ్చ జగత్కారణమవ్యయః తత్త్వమస్యాది వాక్యార్థ స్వరూపీ నిష్కళంస్స్వయం । ఏవంబ్రహ్మాద్వితీ యంచ సత్యంజ్ఞానం సుఖాత్మకం । నిర్గుణం నిర్మలంశుద్ధం జనిమాఖ్య నిరంజనం । దేవానామాది భూతశ్చరుద్రోవిశ్వాధికోప్రభుః। సర్వజ్ఞస్స ర్వకర్తాచ సర్వకారణమీశ్వరః । అనాది నిధనావస్తుపరాపరవిహీనకం పరమాత్మ స్వరూపంచ పరబ్రహ్మస్వరూపకం । నిష్ప్రపంచం పరం తత్త్వమప్రమేయమనూపమం । కథయంతీతివేదాంతాశ్శివంపరమ కారణం । మహాలింగస్వరూపోయం శంకర స్యసదాశివః ఇతిజానంతియే భక్తాఃగురోర్కారుణ్యతశ్శివంశోకం తరంతితే సర్వేమహాదేవ ప్రసాద తః సర్వవేదాంతసారంహి చిదంబరసమన్వితం పూజయేద్భ్రదయా కాశేస్వాత్మనోహితమాచరన్ ప్రకారోబహవోలోకేదహ్రోపాసనా దయః సాతుకార్యావీరశైవై ర్గగ్నభీతాది సంస్కృతైః లింగాంగ సామ

తన్యేన శివభావసమన్వితైః కాలమోరాగమార్గాను సారేణాతి సమా హితైః స్ఫుటీభవిష్యలిఙ్గాలసూత్మ్న మధ్యమభేదతః త్రివిధాశివపూజా పిచోపదేశే చతుర్దశే॥

తా॥ సంసారపాశ విమోచకమైన జ్ఞానము లింగాంగ సామర స్యముచేతనే కలుగును. శివుడేపరతత్త్వము శివుడేపరమమైన బాహ్య తేజస్సు శివుడే సర్వోత్తమమైన పరంజ్యోతి స్వరూపుడు శివుడేపరా త్పరుడనబడును. వేదాంత సూత్రములందు యేదిపరబ్రహ్మమని వ్యాసమునివలన ఉక్తమైనదో యదియేశివుడు. శివుడేలింగము. లింగమేశివుడు శివుడు తానే సమస్తమైన వేదాంతవాక్యములకు ప్రతి పాద్యుడై యున్నాడు. శివుడే సమస్తతత్త్వములకు నవలంబనముగాను జగత్తునకు కారణుడుగాను నాశరహితుడుగానున్నాడు. నిరంకుశుడుగా దత్పదమున కర్థమైన పరశివుడే యాదివాక్యములయిన వేదముల కర్థ స్వరూపముగానున్నాడు ఈ శివుడే పరబ్రహ్మము. ఈరీతిచేనద్వితీయ ముగాను సత్యజ్ఞాన సుఖాత్మకముగాను నిర్గుణనిర్మలశుద్ధ నిర్లేపస్వభావ ముగాను లింగమను పేరుగల్గియున్నది. బ్రహ్మాదిదేవతలకునాదియందా విర్భవించిన జనముల జననమరణరూపమయిన రోగమును నానావిధ రోదనములనుసహా పోగొట్టుటచే రుద్రుడని ప్రసిద్ధుడైన పరశివుడే ప్రపంచమునకు నధికుడైన ప్రభువు సర్వమును దెలిసినవాడు సర్వ మును చేయువాడు. సర్వమునకు కారణుడైనవాడు. సర్వమునకు నియామకుడైనట్టివాడును. ఉత్పత్తినాశనములులేక సర్వసముడౌటచేత నుత్తమాధమ భావరహితముగా నన్నిటియందుండు వస్తువనబడును. ఆత్మసమిష్టిభావముచే పరమాత్ముడనియు సర్వోత్తమభావముచేతను సర్వాతీత భావముచేతను కూడిన పరమమనియు వ్యాపకభావముచేత బ్రహ్మమనియును సర్వప్రపంచస్థితి స్థానమగుటచేత నిష్టమనియు

స్వానుభవజ్ఞాన ప్రాప్యభావముచేత ప్రాప్యమనియు ప్రకృత్యాదుల వలననశ్వరము లేనిదగుట పరతత్వమనియు సర్వసాక్షి భావముచేత గోచరముకానందున నప్రమేయమనియు. అద్వితీయభావముచేత నను పమానమనియు కారణములకు గారణమైనదగుటచేత పరమకారణ మనియు "శివమద్వైతం చతుర్థం మన్యంతే" యను" శృతివచనమువలన శివుడనియు వేదాంతశాస్త్రములీవస్తువునే చెప్పుచున్నవి, నేనధికుడను నేనేయధికుడనని బ్రహ్మవిష్ణువులు కలహించుటయందు నాయొక్క పాదప్రదేశమునుగాని శిరోభాగమునుగాని యెవడుగన్గొనివచ్చునో యతడధికుడని మాఘకృష్ణ చతుర్దశీ రాత్రియందు మహాలింగస్వరూపముచే నతడావిర్భవించి సదామంగళ స్వరూపుడైన యాసదాశివుడే సర్వశుభప్రదుడైన యాశంకరుడని గురుకారుణ్యముచే యేనాభక్తులు శివునెరుంగుదురో వారెల్లరు మహాదేవుని ప్రసాదముచే సంసారసాగరమును దాటుదురు. చిదాకాశరూపుడైన జీవునియందు జేరుకుని యున్నట్టి సర్వవేదాంత సారమైన జ్ఞానరూపముచేత బ్రకాశించు పరశివుని యాత్మహితకారియైనవాడు హృదయాకాశమునందు పూజించవలెను. శివపూజయందు దహరోపాసనాది రూపమైనట్టి యనేక రీతులు లోకమునందున్నవి. గర్భదీక్షాదిసంస్కారములచే శుద్ధులై లింగాంగసామరస్యముచే సర్వత్రశివభావముతోగూడి సాయంప్రాతస్సంధ్యాకాలములయందు శైవాగమానుసారముగా నేకచిత్తులైన వీరశైవులచే నాపూజ చేయదగినది స్థూలసూక్ష్మమధ్యమ భేదములచే మూడు విధములైన పూజను చతుర్దశోపదేశమందు స్పష్టముగా చెప్పబడినది.

శ్లో. సాచపూజాహ స్తపీకే । ముఖ్యాన్యత్రాపి కేచన । తన్మా
త్రే శైవసంతుష్టశ్శంభు ర్నిశ్రేయసంప్రదః

తస్యాపిమూర్త యస్సంతి పంచవింశతి సంఖ్యయా తాశ్చ కుర్వంతు లింగస్య పూజనం భక్తిపూర్వకం । విష్ణ్వాదయస్సురగణా । యక్షరక్షోగణాస్తథా జన్మకర్మనివృత్యర్థం మునయోధృత నిశ్చయాః । ఉపాసతే మహాలింగం బహవో మోక్షకాంక్షిణః ! నిత్యాపరోక్ష విజ్ఞానం చిద్ఘనానంద రూపిణం । లింగంచ । జనిమంచిత్రం ఋతం బ్రహ్మేడితం పరం। సత్యం జ్ఞానం సుఖం నిత్యం వార్ధకం శరణం శ్రుతం ఏవమాదీని నామాని సంతిలింగస్య భూరిశః । తల్లింగమేవ సూత్రేషు వ్యాసేనాపి విచారితం । నీలకంఠ శివాచార్యైస్తత్తాత్పర్యం ప్రకాశితం కలికల్మషనిర్ధూతతత్వబుద్ధిభిరన్యథానీతం యథా తథా శాస్త్రం సద్గురో రహస్యదర్శనాత్ । అమాత్సర్యపరిప్రాప్తమతికౌశలశాలిభిః । విశ్లాఘనీయ యేవార్థః కథ్యతేత యథాతథా । అథాతో బ్రహ్మజిజ్ఞాసేత్యస్మిన్ సూత్రేయదీరితం । తద్బ్రహ్మకేవలం లింగంజ్ఞాతవ్యంచ ముముక్షుభిః । సమనంతర సూత్రేషు తద్గుణా యేవవర్ణితాః । అనంతర్యేథ శబ్దస్య । పూర్వకాండానురోధతః । కిమనంతర మిత్యుక్తే వాచ్యంధర్మ విచారతః । అనంతర్యం విచార్యస్య బ్రహ్మణో లింగ రూపిణః ॥

తా॥ కరపీఠమందు జేయబడు పూజయే ముఖ్యము బాహ్యపీఠమందునుమంచిదేయనికొందరందురుతత్వమునుదెలిసి పూజించువాడుదుర్లభుడగుటవలన తావన్మాత్రముచేసంతుష్టుడైనపరశివుడాపూజకునకు ముక్తినిచ్చును. ఆశివునకు నిరువదియైదుమూర్తులు కలవు. ఆమూర్తులు విష్ణువు మొదలైన దేవగణములుయక్షరక్షోగణములు జ్ఞాననిశ్చయము గల మునులు సహాజన్మసాధకవృత్తికొరకు శివునిపూజించెదరు. ఇట్లనేకులు మోక్షార్థులై నిత్యాపరోక్షవిజ్ఞానరూపముగాను శాస్త్రజ్ఞానముల ఘట్టిగా నానందరూపముగాను బ్రకాశించు మహాలింగమును

ఉపాసనాక్రమముచే బూజించెదరు విచారమందు బాహ్యవిచారమం తయునులయించుటచే లింగమనియు పాషాణాదులచే చేయబడి ప్రతి ష్ఠావిధిచే దేవభావప్రాప్తిరూపమయిన (జనియందు) అనగా పుట్టుక యందు సర్వఫలప్రదమైనట్టి మాలనుపదమున కర్థమైన లక్ష్మీయుం డుటచేత జనిమయనియు నాశ్చర్యకరమైన శక్తిచే చిత్రమనియు (ఋతంసత్యం పరంబ్రహ్మ) అను మంత్రముచే బూజింపబడుటచే ఋత మనియు వ్యాపకభావముచే బ్రహ్మమనియు సర్వత్రస్తుతమగుటచే ఈ డితమనియు సత్యమైన ఫలమునిచ్చుటచే సత్యమనియు జ్ఞానసాధన మగుటచే జ్ఞానమనియు నిరతిశయసుఖ సాధనమగుటచే సుఖమనియు శాశ్వతమగుటచే నిత్యమనియు జ్ఞానవృద్ధసమూహముచే పూజకమగు టచేత వార్ధకమనియు శ్రుతిప్రసిద్ధమగుటచే శ్రుతమనియు లింగము చెప్పబడును. లింగమునకు నిట్టి పేళ్ళుపెక్కుగలవు, ఆలింగమే వ్యాస మునిచేత సూత్రములందు విచారింపబడినది. నీలకంఠ శివాచార్యు లచే నామునీశ్వరుని తాత్పర్యము ప్రకాశింపబడియున్నది. కలిదోష ముచే పోగొట్టబడిన తత్వజ్ఞానముగల పండితులు సద్గురుదర్శనము లేనివారై ప్రకారాంతముగా మనస్సుకు వచ్చినట్లు చెప్పియున్నారు. మాత్సర్యరహితమగుటచే ప్రాప్తమయినబుద్ధి చాతుర్యమున బ్రకా శించు యితరులచేత పర్యవసానమునందెటుల నిలుచునో యట్లే చెప్పబడినది. ఆదెట్లనగా అథాతోబ్రహ్మజిజ్ఞాసా అను వేదాంతసూ త్రమునందు బ్రహ్మశబ్దార్థము లింగమనియు నుత్తరసూత్రములందట్టి గుణములై వర్ణింపబడియున్నవనియు ముముక్షువులచే దెలియదగినది. అనంతర్యబోధకమయిన ఆఅథశబ్దముచేనైన అనంతర్యమేమన అథా తో బ్రహ్మజిజ్ఞాసా అని కర్మమీమాంసాసూత్రముండుటచే ధర్మవిచా రాన తర్వాతని దెలియదగినది యీ విషయము వీరశైవోత్కర్షయను గ్రంధమందు చూచి తెలిసికొనవలెను.

లింగమే బ్రహ్మమని విచారణ చేయబడుటచే నీమతప్రవర్తకులైన వీర శైవులు సర్వమున్నూ బ్రహ్మమని వేదార్థమైన యనుసంధానముచేసి బ్రహ్మ, లింగ, జనిమాది శబ్దములు పర్యాయపదములగుటచేతతత్వజ్ఞానము కొరకు బ్రహ్మమను పదము నుపయోగించవలసినచోటుల నెల్ల లింగమని ప్రయోగించియున్నారు. ఈ విషయము దెలియక మంద బుద్ధులు బ్రహ్మమనగా వేరు లింగమనగా వేరని యభిప్రాయపడుదురు.

శ్రు॥ అమృత స్య దేవధారణో భూయాసం॥ ఈశ్రుత్యర్థము లింగ ధారణమును ప్రతిపాదించుచున్నది. వేదారణ్యభాష్యమునందు వేదారణ్యులవారు అమృతస్య దేవ ధారణః భూయాసం॥ అని పదవిభాగము చేసి మృతం నభవతీత్యమృత్యం- తస్య అమృతస్య, నాశన రహితమగు కైవల్యపదమునకు అనగా కైవల్యపదప్రాప్తి కొరకు దేహధారణః - దేవ - దేవునియొక్క, ధారణ -ధరించడము - భూయాసం, కావలయునని అర్థము చేసిరి.

బహ్వచ బ్రాహ్మణ్యం ॥శ్రు॥ ఆదావాసే వ్యాదార్భ వాత్సదేవాశ్మ వేనవై తేజసో వై ధారయేస్ఫటికాల్లింగందత్వా వరణాపంచకం దశస్థితే నైవాగుచు ముఖేనధారయేత్ప్రజాపత యేస్ఫటి కావరణాల్లింగం ధారయతి॥

ఋగ్వేదే॥ సోమా రుద్రాయువమేవతాత్యస్మై విశ్వతనూషుభేషజానిధత్తం । ఆవస్యతం ముచతంయన్నో । అస్తితనూషు బధ్నం కృతమేనో అస్మత్, అను శ్రుతులు గూడ లింగధారణమును ప్రతిపాదించుచున్నవి.

ఋగ్వేదే॥ ఋగ్వేదే॥

అయం మే హస్తో భగవాన్ । అయం మే భగవత్తరః । అయం మే విశ్వభేషజో యగ్ం శివాభిమర్శనః । అయం మాతా । అయం పితా అయం జీవాతు రాగమతు । ఇదం తవ ప్రసర్పణం । సుబంధ వేహి నిరేహి॥ అస్యార్థః । అయం మే హస్తః । అయం మే హస్తో భగవాన్ । భగవానితి । ఐశ్వర్యస్య సమగ్రస్య । వీర్యస్య యశసశ్శ్రియః । జ్ఞానవైరాగ్యయోశ్చైవ । షణ్ణాం భగ ఇతిస్మృతః॥ భగవాన్ ఇతి । తతః భగవానితి కిం భగవచ్ఛబ్దః పూజ్యవాచకః । అయం మే భగవత్తరః । అయం హస్తో భగవత్తరః । తరశబ్దః । అతిశయార్థే ప్రవర్తతే । అతిశయాయ నేతరస్తమహామితి సూత్రాత్తస్మాదేవ విశిష్టో హస్తః । అయమ్మే విశ్వభేషజః । విశ్వస్య మాయాప్రపంచస్య రోగవైద్యః అభిమర్శన శబ్దః । కేవలం నస్పర్శనవాచి । కింతు అభితః । పరితః స్పృశతీత్యభిమర్శనః । నిజకరశాఖా కరతల కలితలింగమూర్తే సర్వాంగం స్పృశతీత్యభిమర్శనః । అయం మాతా । అయం హస్త ఏవ మాతా । అయం పితా । అయం హస్త ఏవ పితా । అయం జీవాతుః । అయం హస్త ఏవ జీవాతుః । జీవాతుర్జీవనౌషధం । ఆగమాత్॥ ఇదం తవ పరిసర్పణాం । ప్రసర్పణమితి పరిజననం । సుబంధో । శోభనో బంధుః । ఆత్మబంధుమిత్యర్థః । తస్య సంబోధనం । హే సుబంధో । తవ ఇదం ప్రసర్పణం । ఇదం లింగం । యేహి । అఇహి । నిరేహి । నిరంతర మేహి । సర్వదావ సేత్యర్థః । హస్తాద్విముక్తః కదాచిన్న భవేత్యర్థః॥

అస్మిన్నర్థే॥ వాతూల తంత్రే॥ ధారయేద్యస్తు హస్తాబ్జాలింగాకారం శివం సదా । తస్య హస్తస్థితం విద్ధి మక్సదం సంపదాం పదం॥

తా॥ హస్తాదియందు శివస్వరూపమగు లింగమును ధరించి పూజించువానికి సర్వసంపన్నిధియగు ముఖ్యస్థానము చేతియందే గలదను శివవచనము వాతూలాగమమందు గలదు. మరియు శ్రుత్యర్థమును

తెలియపరచుచున్నాను। లింగమును కరపీఠమందుంచి పూజించుటే ముఖ్యమని వేదాగమ పురాణములు ఘోషింపుచున్నవి.

అయంమేహస్తః ఇదినాయొక్కహస్తము అయంమేహస్తోభగవాన్ = నాయొక్క ఈ హస్తమేభగవంతుడు భగవానీతి ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః। జ్ఞానవైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగయితిస్మృతః॥ అష్టైశ్వర్యములు పరాక్రమము యశస్సు సంపద జ్ఞానము వైరాగ్యము అను వాటిని గలిగియున్నవాడు గనుక భగవంతుడనబడును భగవానీతి భగవంతుడనగాయిదితతః భగవానితికిం భగవంతుడనగానేమి భగవచ్ఛబ్దః పూజ్యవాచకః భగవచ్ఛబ్దము పూజ్యవాచకము అనగా భగవంతుడు పూజనీయుడు అయంమేభగవత్తరః అయంహస్తో భగవత్తరః యీనాయొక్కహస్తమే భగవత్తరమయినది. ఈ భగవత్తరమను వాక్యములో తరశబ్దమువున్నది. తరశబ్దః అతిశయార్థే ప్రవర్తతే తరశబ్దమునకు అధికము అను తాత్పర్యము॥ అతిశయాయనే తరస్తమయితి సూత్రాత్తస్మాద్దేవవిశిష్టోహస్తః= తరతమములనే ప్రత్యయములు అతిశయార్థకములయినవి = యీ హస్తము దేవునితోకూడియున్నదిగనుక అతిశయార్థమును బోధించు తరశబ్దముతోకూడియున్నది భగవత్తరమైనది అనగా దేవునితో గూడియున్నది. గనుక మిక్కిలి పూజ్యమయినది. అయంమేవిశ్వభేషజః=యీహస్తము మాయాప్రపంచమను రోగమునకువైద్యుడు అయంశివాభిమర్శనః=యిది శివునిసర్వాంగములను స్పృశించుటవైయున్నది. ఎందుకనగా యీపదములోనుండు మర్శనమను పదమునకె స్పృశించుటయని యర్థము=అభిమర్శనమనగా॥ముట్టుటమాత్రమేకాదు. అంతటను స్పృశించుట అనగానిజకరశాఖాకరతల కలిత లింగమూర్తే సర్వాంగం స్పృశతీత్యభిమర్శనః నిజకరతనహస్తముయొ

క్క కరతల= అరచేతిలో కలిత = ఉన్నట్టి లింగమూర్తే = లింగమూర్తియొక్క సర్వాంగం = లింగమూర్తినిఅంతయును = స్పృశతీ త్యభిమర్శకః॥ స్పృశించుట అభిమర్శనమని యర్థము॥ అయంమాతా యీహస్తమే తల్లి॥అయంపితా యీహస్తమేతండ్రి॥ అయంజీవాతుః యీహస్తమేజీవనౌషధము ఆగమాత్ ఇదంతవపరిసర్పణం ఇది అనగా యీలింగార్చన పూర్వకముగా వామహస్తమందుంచుకొని సర్వాంగములను స్పృశించుట తవ=నీయొక్క పరిసర్పణం=పరిజననము అనగా నిన్ను యేశ్వర మట=నీపుట్టుకమైయున్నది. సుబంధో=ఆత్మబంధో అనగా ఆత్మబంధువైన ఈశ్వరాత్తస్యసంబోధనం = ఆత్మబంధువైన ఈశ్వరాయనిపిలుచుట తవఇదంపరిసర్పణం తవ=నీయొక్క॥పరిసర్పణం ఆగమనము ఇదం ఇదియే ఇదంలింగం యీహస్తమందున్నలింగమూర్తిని గూర్చి ఏహి=రమ్మని శేహినిరంతరమేహిసర్వదావసేత్యర్థః అనగా సర్వదానిలచియుండుము అనియర్థము అనగావాహస్త్రాద్విముక్త కదాచిన్నభవేత్యర్థః అనగాకదాచిత్=ఒకప్పుడైననూవాహస్త్రాద్విముక్తః నాహస్తమువలన విడువబడినవాడవు,నభవా= కాకయుండుమా॥

ఇట్టుల బ్రహ్మమనబడులింగమును ధరించియుండియును,యజ్ఞోపవీతమును ధరించనియెడల తమబ్రాహ్మణత్వమునకు లోపమువచ్చునేమోయని, కొందరులింగమన్నను. యజ్ఞోపవీతమన్నను తాత్పర్యమొక్కటియే యను సంగతితెలియక, లింగమున్నూ, నూలుయజ్ఞోపవీతమున్నూ కూడ ధరించుచుండుట ధర్మవిరుద్ధము. మరియు "యజ్ఞోపవీతం పరమం పవిత్రం" అను మంత్రమున్నూ ఏతత్సోమస్య సూర్యస్య అను మంత్రమును కూడా లింగపరమైయుండుటచేత లింగధారణమే యజ్ఞోపవీతధారణమైయున్నది.

"యజ్ఞోపవీతం పరమంపవిత్రం అనుమంత్రము లింగప్రతిపాదక మెట్లనగా యజ్ఞోవైవిష్ణురితిశ్రుతేః ॥ యజ్ఞస్యవిష్ణునామ్నః పీఠస్య ఉప, సామీప్యేన వి విశేషేణ ఇతం ఆవృతం యజ్ఞోపవీతం శివలింగ మిత్యర్థః అని వ్యుత్పత్త్యర్థము గనుక యజ్ఞోపవీతమనగా శివలింగ మని యర్థము.

యజ్ఞోవైవిష్ణుః అనుశ్రుతిననుసరించియజ్ఞమనబడు శబ్దమున కర్థము విష్ణువు. విష్ణువనగాశక్తి. ఈశక్తియేశివునకు పీఠము. ఇందునుబట్టి శక్తియన్నను, విష్ణువన్నను, యజ్ఞమన్నను తాత్పర్యమొక్కటియేగ నుక శివునకు పీఠమైయుండుశక్తి,విష్ణు, పదములకు, యజ్ఞమనిపేరుగన్కు యజ్ఞమనగా శివునకు పీఠమని తెలియవలెను. శివునకు పీఠమగు యజ్ఞ మునకు అనగా శివునకు పీఠమునకు ఉప_సమీపమందు-వి-విశేషముగా ఇతం ఆవరింపబడినది, అనగా శక్తి, విష్ణు, అను పదముల కర్థమిచ్చు నట్టియు, యజ్ఞమని చెప్పబడునట్టియు పీఠమునకు సమీపమందు దాని చేవిశేషముగా నావరింపబడినది అని అర్థము.

విశేషముగా అని ఎందుకు వ్రాయబడినదనగా లింగమగు బ్రహ్మమందుండుశక్తి ఆబ్రహ్మమునకు సమాన ధర్మిణియని యుండు టవలన విశేషముగా అని వ్రాయబడినది. ఈశివశక్త్యాత్మకమగు స్వరూపమే లింగము. యజ్ఞమన్నను, విష్ణువన్నను, శక్తియనినను తాత్పర్య మొక్కటియే యనిపైనవ్రాయబడుటకుప్రమాణమెట్టిదనిన యజ్ఞోవైవిష్ణుః" అను శ్రుతిననుసరించి యజ్ఞశబ్దము విష్ణువున కర్థమై యున్నది. ఆవిష్ణుపదము పరమేశ్వరునియందుండు శక్తికి బోధకమై యున్నది. ఎట్లనిన

శ్లో॥ ఏకైవశక్తిః పరమేశ్వరస్య భిన్నాచతుర్ధా వినియోగకాలే భోగేభవాని పురుషేషువిష్ణుః కోపేచకాళీ సమరేషు దుర్గ"

తా॥ భోగమందు భవానివలెను, పురుషులందు విష్ణువలెను, కోపమందు కాళివలెను. రణమందు దుర్గవలెను పరమేశ్వరుని యం దుండుశక్తియే కార్యవిశేషములందు నాల్గువిధములుగా భిన్నమైనదని ఆగమవచనము.

మగియు "ఉమాసహోహరిస్సాక్షాద్యోహరిస్స శివాస్మృతః" తా॥ ఉమయేహరి హరియేశివఅనగా పార్వతియనువచనాంతరమున్నది

శ్లో॥ ప్రకృతిస్త్వం పుమాన్ రుద్రస్త్వయితద్వీర్య మాస్థితంత్వ న్నాభి పంకజాజ్జాతః పంచవక్త్రః పితామహః"

తా॥ నీవుప్రకృతివి పురుషుడురుద్రుడు రుద్రుడు నీయందు వీర్యమువిడుచుటవలన నీయొక్క నాభికమలమందున, పంచముఖ బ్రహ్మ పుట్టినాడని విష్ణువును గురించినప్రమాణము బ్రహ్మాండపురాణములో కలదు.

"త్వంచంద్రమా అహంసూర్య నిశీథత్వమహందివేతి॥ తా॥ నీవు చంద్రుడవు నేనుసూర్యుడను. నీవు రాత్రివి నేను పగలు అని విష్ణువుతో శివుడు పలికిన శివవచనము ఆదిత్యపురాణమందున్నది.విష్ణుపురాణే ॥శ్లో॥ ప్రకృతిఃపరమోవిష్ణుః॥ శ్రు॥ మాయాంతు ప్రకృతిం విం ద్యాన్మాయినంతుమహేశ్వరః, రుద్రోపనిషత్తునందు శ్రు॥ పుల్లింగం సర్వమీశానః స్త్రీలింగం భగవత్యుమాఉమారుద్రాత్మి కాసర్వాః ప్రజాస్థావరజంగమాః । వ్యక్తంసర్వముమారూప మవ్యక్తంతు మహేశ్వరః॥

శ్లో॥ రుద్రోలింగముమాపీఠంతస్మైతస్యైనమోనమః సర్వదేవాత్మకం రుద్రం నమస్కుర్యాత్పృథక్పృథక్॥ అనివ్యాస వచనము (విష్ణోశ్శివశక్తిత్వవ్యపదేశాత్ । శివస్యశక్తిపీఠవత్వాచ్చ)

తా॥ శివునియందుండు శక్తియే విష్ణుస్వరూపమైయుండుట వలనను, ఆవిష్ణు స్వరూపమగు శక్తియే శివునకు పీఠముగా నుండుటచేతను విష్ణు, శక్తి, యజ్ఞపదములచే చెప్పబడు పీఠమును గల శివస్వరూపమునకు లింగమనియు, యజ్ఞోపవీతమనియు పేరు. ఇట్టి శివ విష్ణు, స్వరూపమైన లింగము పరబ్రహ్మమనియు, పరశివుడనియు, యజ్ఞోపవీతమనియు, సూత్రమనియుకూడ చెప్పబడును. ఎట్లనిన?

లైంగ్యేషోడశోధ్యాయే॥ లోకాశ్చయత్ర తిష్ఠంతి । సూత్రే మణిగణాఇవ । తత్సూత్రమితివిజ్ఞేయంరూపమద్భుతమీశ్వరం॥

తా॥ లైంగ్యమందు పదునారవ యధ్యాయములో సూత్రమందు మణులవలె లోకము లెవనియందుండునో, యట్టి పరమేశ్వరుని రూపమే సూత్రమని ప్రమాణమున్నది.

భగవద్గీతాయాం॥ ఏనసర్వమిదం ప్రోతంసూత్రేమణిగణా ఇవ॥

యజుశ్శాఖాయాం వీరశైవోపనిషత్ ॥శ్రు॥ సంస్యూతత్వాత్సమస్తేషువస్తుష్వపిచసంతతం । సూచనాత్పరమేశస్యసూత్రం లింగమితీరితం । యదక్షరం పరంబ్రహ్మతత్సూత్రమితిధారయేత్ । ధారణాదస్య సూత్రస్యనోచ్ఛిష్ఠంనాశుచిర్భవేత్॥

తా॥ జంగమాజంగమ మైన సర్వపదార్థములందు సంతతము సచ్చిదానందములచే చేరికొని యుండుటచేతను పరమేశ్వరునకు సూచకముగా నుండుటచేతను లింగమేసూత్రమనబడును. ఎయ్యది పరబ్రహ్మమో యద్దియే యీసూత్రరూపముగానున్నదని ధరించవలెను. ఇట్టిధారణ యందుచ్ఛిష్ఠాశుచి దోషములు సంభవింపవని యర్థము.

బ్రహ్మోపనిషత్తునందు శ్రు॥ బ్రహ్మసూత్రమిదంజ్ఞేయం సూత్రంనామపరంపదం తత్సూత్రంధారయేద్యోగి సవిప్రోవేదపారగః॥

7

నిరాలంబోపనిషత్తునందు శ్రు॥ ఏషసర్వమిదం ప్రోతం సూత్రే మణిగణాఇవ - తత్సూత్రం ధారయేద్యోగి యోగవి త్తత్వ దర్శివాన్ - బ్రహ్మభావమిదం సూత్రం ధారయేద్యస్స చేతనః । ధారణా త్తస్యసూత్రస్య నోచ్ఛిష్టోనాశుచిర్భవేత్ సూత్రమంతర్గతంఏషాంజ్ఞానయజ్ఞోపవీతినాం । తేవై సూత్రవిదోలోకే తేచయజ్ఞోపవీతినః॥

తా॥ ఎవరియందు బ్రహ్మాండ భాండములన్నియు సమిడీకృతమైయున్నవో యట్టిపరమేశ్వరుని స్వరూపమే సూత్రమనబడును. ఈసూత్రమునే బ్రహ్మసూత్రమనియు జ్ఞాన యజ్ఞోప వీతమనియు, ప్రణవస్వరూపము లింగమనియు చెప్పబడును. ఇట్టిసూత్రమును జ్ఞానులుధరించవలెను. ఇట్లుచెప్పబడిన పరబ్రహ్మ, పరశివ, యజ్ఞోపవీత, సూత్రపదములచే చెప్పబడు లింగము త్రివృత్సూత్రమనికూడ జెప్పబడు చున్నది. ప్రమాణమేమనగా;

కారణాగమే॥ తదాహాయమునీం దృష్ట్వాభజధ్వంమునిపుంగవాః । భస్మరుద్రాక్ష నిష్ఠాతాస్స్ఫాటికం శైలజంతువా। శివవిష్ణుమయం లింగం త్రివృత్సూత్రం సనాతనం యజ్ఞోపవీతం పరమం పవిత్రం శ్రద్ధయాసహ కరాబ్జపీఠే నియతం భజధ్వం శ్రుతికోవిదాః । ఇత్యుక్త్వా భగవాన్ బ్రహ్మసత్యలోకమగచ్ఛత॥

తా॥ కారణాగమమందు బ్రహ్మదేవుడు వేదాభిజ్ఞులయినమునులతో మీరు భస్మరుద్రాక్షధారులై, త్రివృత్సూత్రమనియు, సనాతనమనియు, యజ్ఞోపవీతమనియు, పరమమనియు, పవిత్రమనియు, చెప్పబడు శివవిష్ణుమయ మగుస్ఫటికలింగముగాని, శైలలింగమునుగాని కరపీఠమందుంచి పూజింపుడని చెప్పి సత్యలోకమునకు జనెనని యున్నది.

## త్రివృత్సూత్రార్థవివరము.

త్రయః స్థూలసూక్ష్మకారణ శరీరాభిమానినో విశ్వాదయో జీవాః ఉతజీవాస్తః పరమాత్మనః వృత్ । ఇష్టలింగ ప్రాణలింగ భావలింగాఖ్యావరణానియస్యతత్సూత్రం మణిగణసూత్రవత్సర్వవ్యాపకం త్రివృత్సూత్రం జ్యోతిర్మయం మహాలింగ మిత్యర్థః॥

టీ॥ మహాలింగలీలయందు, పరశివునకు భిన్నమయిన చిచ్ఛక్తి యొక్క అంశము సూత్రమందు మణివలె పరశివ రూపమను సూత్రమందు మేఘమందుండు జలము వర్షధారరూపకముగా వచ్చినట్లు అధోముఖమై యాపరశివసూత్రమును విడువకయే ప్రాజ్ఞుడను పేరున అవిద్యయను కారణ దేహములో చిద్బిందువుగానుండి యాసూత్రమును విడువకనే బ్రహ్మవిద్యాప్రాబల్యమున నూర్ధ్వముఖమై యాకారణ శరీరమునందభిమానము నశించి యోగాంగమను పేరుబడసి తానుశివాంశమగుపరమాత్మతో కూడియే యున్నానని తలంచుచు తననిజరూపముగల పరశివతత్త్వమగు లింగమందు లయమును బొందును. ఇది భావ లింగ సూత్రము. పరశివునకభిన్నమైన చిచ్ఛక్తియొక్క అంశము పరశివ స్వరూపమనెడు సూత్రమందు అధోముఖమై ఆపరశివసూత్రమును కూడియుండియే తైజసుడనుపేరున సూక్ష్మ శరీరమందు ప్రాణమైయుండి బ్రహ్మవిద్యాప్రాబల్యమున నాసూత్రమును విడువకనే ఊర్ధ్వముఖమై యాసూక్ష్మశరీరమునందభిమానమునశించి భోగాంగమను పేరును బడసి తాను శివాంశమగునంతరాత్మతో కూడియేయున్నానని తలచుచు తన నిజరూపముగల పరశివతత్త్వమగు లింగమందు లయమును పొందును. ఇది ప్రాణలింగసూత్రము.

పరశివునకభిన్నమయిన చిచ్ఛక్తియొక్క అంశము పరశివస్వరూపమనెడు సూత్రమునందు అధోముఖమై యాపరశివ సూత్రమును

విడువకయే విశ్వుడను పేరున స్థూలదేహమందు జీవమైయుండి బ్రహ్మ విద్యాప్రాబల్యమున నాసూత్రమున కూడియుండే యూర్ధ్వముఖమై యా స్థూలదేహమునందభిమానము నశించి త్యాగాంగమను పేరును బడసి శివాంశమగుజీవాత్మతో కూడియే యున్నానని దలచుచూ తననిజరూపముగల పరశివతత్వమగు లింగము ,దులయమును బొందును॥ ఇది ఇష్టలింగసూత్రము ఈ యిష్టప్రాణభావలింగరూపములుగా నుండుసూత్రమునకు త్రివృత్సూత్రమనియు, యజ్ఞోపవీతమనియు, లింగ మనియుపేరు. మరియునీత్రివృత్సూత్రముయొక్క తాత్పర్యము బాగుగా తెలియుటకై నీదిగువ వివరముగా వ్రాయబడినది.

## త్రివృత్సూత్రముయొక్క తాత్పర్యము.

మహాలింగ మనబడు పరశివున కభిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశము చిద్బిందు రూపమై సూత్రమందు మణియెటుల గూడియుం డునో యటువలెనే పరశివరూపమనెడు సూత్రమందుగూడి యుండియే అధోముఖమగుటయనెడు కర్మనుజేయును. అందువల్ల అజ్ఞానమయ సుషుప్త్యావస్థాద్య విద్యావరణరూపమగు కారణశరీరము యేర్పడును ఆకారణశరీరమందాచిచ్ఛక్త్యంశమగు చిద్బిందువు పరశివాంశమగు నాత్మతో నధోముఖముగ గూడియుండుటవలనపరమాత్మయను పేరును బొంది యధోముఖముగనే యాకారణ శరీరాభిమానమును గలిగి యుండుటచేత ప్రాజ్ఞుడను నామమునుబొంది తన్నుదా దెలియక తాను పరశివభిన్నభావముతో నుండును. బ్రహ్మవిద్యా స్వరూపమగు వేదా దీక్షవల్ల పరశివరూపమనెడు సూత్రమును విడువకయే యూర్ధ్వముఖ మగుటయనెడు కర్మనుజేయును. అందువల్ల ప్రాజ్ఞుడను పేరుతోసహా కారణశరీరాభిమానము నశించినిష్కళ బ్రహ్మైక్య సమాధియనబడు

పరశివ జ్ఞానమయ విద్యావరణ రూపమగు యోగాంగమును బొంది తదంగాభిమానియై తన్నుదా దెలియుచు అనగా తాను పరశివాభిన్నమని దెలియుచు భావలింగాఖ్యతో నుండు తన నిజరూపమగు మహాలింగము బొందును.

మరియు నా పరశివాభిన్నమగు చిచ్ఛక్త్యంశము మనస్సంయుత ప్రాణరూపమై పరశివరూపమనెడు సూత్రమును కూడి యుండియే అధోముఖమగుటయనెడు కర్మను జేయును. అందువల్ల సంకల్ప వికల్ప స్వప్నావస్థాద్యావరణరూప సూక్ష్మశరీర మేర్పడును అందు తాను పరశివాంశమగు నాత్మతో నధోముఖముగ గూడి యుండుటవలన అంతరాత్మయను పేరును బొంది యధోముఖముగనే యాసూక్ష్మశరీరాభిమానమును గలిగియుండుటచేత తైజసుడను పేరును బొంది తన్నుదా దెలియక తాను పరశివ భిన్నభావముతో నుండుచు, బ్రహ్మవిద్యా స్వరూపమగు మనుదీక్షవల్ల పరశివరూపమనెడు సూత్రమును విడువకయే యూర్ధ్వముఖమగుటయనెడు కర్మను జేయును అందువల్ల తైజసుడను నామముతో సహా సూక్ష్మశరీరాభిమానము నశించి సకలనిష్కళ బ్రహ్మైక్య సమాధియనబడు లింగభోగోపభోగరూప యుక్త పరశివ సంకల్పావరణ రూపభోగాంగమును బొంది తదంగాభిమానియై తన్నుదా దెలియుచు అనగా తాను పరశివాభిన్నమని దెలియుచు ప్రాణలింగాఖ్యతో నుండు తన నిజరూపమగు మహాలింగమును బొందును.

మరియు నా పరశివాభిన్నమగు చిచ్ఛక్త్యంశము చక్షుస్సంయుత జీవరూపమై పరశివరూపమనెడు సూత్రమందు కూడి యుండియే అధోముఖమగుట యనెడు కర్మను జేయును అందువలన ప్రపంచ వీక్షణాది జాగ్రదవస్థాద్యావరణరూప స్థూలశరీరము యేర్పడును అందు తాను పరశివాంశమగు నాత్మతో నధోముఖముగ గూడియుండుటవలన జీవాత్మ

యనెడు పేరుబొంది యధోముఖముగనే యాస్థూలశరీర మందభిమానమును గలిగి యుండుటచేత విశ్వుండనునామమును బొందితన్నదా దెలియక తాను పరశివభిన్నభావముతో నుండును బ్రహ్మవిద్యాస్వరూపమగు క్రియాదీక్షవల్ల పరశివరూపమనెడు సూత్రమును విడువకయే యూర్ధ్వముఖమగుట యనెడుకర్మనుచేయును అందువల్ల విశ్వుడను పేరుతో సహా స్థూల శరీరాభిమానము నశించి సకలబ్రహ్మైక్య సమాధియనబడు సంసారభ్రాంతి సంత్యాగ యుక్త పరశివ వీక్షణావరణరూప త్యాగాంగమును బొందితనంగాభిమానియైతన్నదా దెలియుచు అనగా తాను పరశివాభిన్నమని దెలియుచు నిష్టలింగాఖ్యతోనుండు తననిజరూపమగు మహాలింగమును బొందును.

అధోముఖమయిన శక్త్యంశము శివాంశముతో గూడుటవలన క్రమముగా నేర్పడిన జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మలు, స్థూల సూక్ష్మ, కారణశరీరముల యందభిమానముగలవైనపుడు విశ్వ తైజస, ప్రాజ్ఞనామములతోనుండును. ఈ మూడు దేహముల యందభిమానమునశించి జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మలలోనుండుశక్త్యంశమూర్ధ్వముఖమయినపుడు నిర్మాయాస్వరూపభక్తి రూపమై యాశివాంశమున బరగెడి యాత్మతోగూడి క్రమముగా త్యాగాంగ భోగాంగ యోగాంగములను బొందును త్యాగాంగమును బొందినపుడు సంసారభ్రాంతి సంత్యాగరూప శివవీక్షణ సంయుక్తమగు నిష్టరూపముతోనుండును. అట్టియిష్టమునందు లీనమైయుండుటచేతనున్నూ అట్టి యిష్టరూపమునకు లక్ష్యస్థానమగుటచేతనున్నూ యిష్టలింగమనబడును. భోగాంగమును బొందినపుడు లింగభోగోపభోగరూప శివసంకల్పమనస్సంయుత ప్రాణరూపమై యుండును. అట్టి ప్రాణమందులీనమై యుండుటచేతనున్నూ అట్టి ప్రాణరూపమునకులక్ష్యస్థానమగుటచేతనున్నూ

ప్రాణలింగమనబడును. యోగాంగమును బొందినపుడుపరశివాభిన్నజ్ఞానరూప శివభావ రూపమై యుండును.

అట్టిభావమందు లీనమైయుండుటచేతనున్ను అట్టిభావమునకు లయస్థానమగుటచేత నున్నూ భావలింగమనబడును, మహాలింగమే యిట్టి విధమున నిష్టప్రాణ భావలింగములు మూడుగా యేర్పడెను. ఇట్టివిధమయిన స్థితులకే అవస్థలని పేరు యీమూడేఅవస్థలు ఈ యవస్థలకే నృత్తులనిపేరు వృత్తియనగా ఆవరణము. యీవృత్తులు లేక ఆవరణములు కలదిగాని లేక యీ యావరణముల కావరణమయినది గాని త్రివృత్పాత్రమనబడు మహాలింగమనబడును. అది సర్వవ్యాపకమై జ్యోతిర్మయమై యుండును. ఎట్లనగా

మానికకున్ను మానికలోనుండు సోలకున్ను సోలలోనుండు గిద్దకున్ను వెలుపల లోపల నాకాశము యెటులవ్యాపించి యుండునో యటువలెనే మహాలింగము మణిగణసూత్రవత్సర్వవ్యాపకమైయుండును

పరశివునకభిన్నమగు చిచ్ఛక్తి పరశివునిలోనఖండముగానున్నూ, ఖండఖండములుగా విభజింపబడి యంశములుగా నుండుటయున్నూ, కలదు యిట్టియంశములకే చిచ్ఛక్త్యంశములని పేరు పరశివ స్వరూపమువెల్లప్పుడు నఖండపరిపూర్ణముగానుండునుగానిఖండఖండములుగా విభజింపబడదుగదా పరశివాంశమగు నాత్మయని పైనియెందుకు వ్రాయబడిన దనగా అఖండముగానుండు పరశివస్వరూపమందు ఖండముగానుండుచిచ్ఛక్త్యంశము యెంతస్థలమావరించియుండునో యా స్థలమందలి పరశివరూపమునకే పరశివాంశమనియు లేక శివాంశమనియు పేరు. ఇట్లు గ్రహింపవలయును.

యజుర్వేద॥ ఏతత్సోమస్యసూర్యస్య సర్వలింగగ్ం స్థాపయతీ పాణిమంత్రం పవిత్రం అను మంత్రముకూడా లింగపరముగానున్నది. ఇందుకు ఉపబృంహణ వచనము.

శైవాగమే॥ యజురప్యాహ సర్వంవైలింగం స్థాపయతీతిచ । తస్మాద్ధార్యం మహాలింగం పాణిమంత్రేణమంత్రతః । పాణౌలింగం వినిక్షిప్య దీక్షాకాలే గురుంశివం యేనస్తువతి తన్మంత్రం పాణిమంత్రం వదంతిహి । సోమస్యైతచ్ఛక్తిరూపం సూర్యస్యైతచ్ఛివాత్మకం । పాణౌచమన న్తార్ధుంలింగం సర్వశిలామయం । సంస్థాపయేత్సదా దేహే పవిత్రముపవీతవత్ । పవిత్రత్వాన్మహేశస్య శివస్య ప్రతిపాదనాత్ । పవిత్రకరణాత్త్వంసాంపవిత్ర మితికథ్యతే । అతస్సర్వేషు కాలేషు ధారయేల్లింగముత్తమం । భూమౌప్రతిష్ఠితంలింగం పునర్నోత్పాట్యతేయథా । దేహేప్రతిష్ఠితంలింగం మంత్రేపినవిభజ్యతే । లింగధారి సదా శుద్ధోనిజలింగం మనోహరం అర్చయేద్గంధపుష్పాద్యైఃకరపీఠేసమాహితః । నిత్యానికర్మ బృందాని తథానైమిత్తికానిచశివార్పణధియాకుర్యాత్సమ్యక్ జ్ఞానాభివృద్ధయే॥

తా॥ సోమశబ్దము విష్ణువగు శక్తికిని, సూర్యశబ్దము శివునకును బోధకమైనది. ఇట్టిశివశక్త్యాత్మకమగు అనగా శివవిష్ణుమయమగు లింగమును కర్మానుష్ఠానపరులు నూలుజందెమును ధరించినట్లు ముముక్షువులు లింగమును ధరించనగును. మంత్రస్వరూపమగు లింగమును దీక్షాకాలమందు గురువుహస్తమందుంచి పరశివుని యేమంత్రముచే స్తుతించునో యదిపాణిమంత్రము. లింగము ఎట్టిశిలచేనైనదో యదివిశేషముగుటచేత సర్వశిలామయమని చెప్పబడినది. పాణిపీఠపూజితమగు లింగము మననముచే రక్షించుటకు సమర్థమగును. పీఠమయిన విష్ణువు నావరించియున్న లింగము తేజోరూపమైనదగుటచే స్వతస్సిద్ధముగా

పవిత్రమైనది. భూమియందు ప్రతిష్ఠితమైన లింగమెట్టులు త్వాట్య ముగాకపోవునో యట్లే దేహాంతరమైనది త్యాగములేనిదియైయున్నది. సర్వదాశుద్ధుడైన లింగధారి మనోహరమైన లింగమును కరమందుంచు కొని యేకాగ్రచిత్తుడై గంధపుష్పాదులచే నర్చింపవలెను. నిత్యనైమిత్తి కాదికర్మములన్నిటినికూడ జ్ఞానాభివృద్ధికొఱకు శివార్పణబుద్ధిచే చేయ వలెను. ఓం తత్సవితుర్వరేణ్యం అను గాయత్రిమంత్రముకూడా లింగ పరముగానేయున్నది.

చిచ్ఛక్త్యంశముయొక్క ప్రార్థనాపూర్వకమయిన భావస్వ రూపమగు గాయత్రి లింగమునందెటులగలదో ఆవివరము మంత్రి శాస్త్రమనబడు అథర్వణ వేదమందు చక్కగా గానబడును. ఆవివరము నీదిగువ కనుపరచబడిన గాయత్రిసహిత లింగరూపచక్రమును జూచిన యెడల తెలియగలదు.

(ఓంకార బాణంశక్తి రేవపీఠం)

సర్వతాప్రిపరిపూర్ణమైయుండు పరశివునిలో చంద్రునియందలి చంద్రికవలె అభిన్నముగానుండెడు చిచ్ఛక్తియొక్క అంశము అధో ముఖముగానుండునపుడు జీవస్వరూపమైయుండి సద్గురునివల్ల బ్రహ్మో పదేశమును బొందినపుడూర్ధ్వముఖమై బ్రహ్మపదార్థ మనునది యొకటియున్నదని తెలిసికొని యాపరబ్రహ్మము ఓంభూః ఓంభువః ఓంసువః మొదలుగాగల లక్షణములను గలిగియున్నదనియు తానా బ్రహ్మమున కభిన్నమనియు ఈ ప్రకారముగా తాను తెలిసికొన్న విషయములను మరచిపోకుండా పరబ్రహ్మమును జ్ఞప్తిలోనుంచుకొ నుచూ యాబ్రహ్మమే నేననెడు యనుసంధాన పూర్వకమగు సాధన చేసికొనుటకు బ్రహ్మమగు లింగధారణమును వహించియుండవలయు ననియు యిట్టివిధముననున్నప్పటికి అధోముఖమయి మరపుజెందుట తనకు స్వభావముగనుక అట్లు మరపుకాకుండా తనబుద్ధులను మలచిపి

8

గానుండునట్లు ప్రేరేపించుమనుచూ "సూత్రంలింగ మితీరితం" అను శ్రుతి ననుసరించి సూత్రమందలి మణివలెను మహాలింగమను సూత్రమందు గూడియుండి పరశివుని ప్రార్థించునపుడా జీవస్వరూపమై యున్న చిచ్ఛక్త్యంశముయొక్క స్తుతిపూర్వకమగు భావమునకుగాయం తంత్రాయత ఇతిగాయత్రీయనెడు ప్రమాణముచేతి గాయత్రియని పేరు జీవస్వరూపమైయున్న చిచ్ఛక్త్యంశము చేయు ప్రార్థనారూపమగు గాయత్రీమంత్రము నీ దిగువ వివరించడమయినది.

## గాయత్రీమంత్రము.

ఓమ్‌భూర్భువః స్వఃతత్స వితుర్వరేణ్యం భర్గోదేవ స్యధీమహి।
ధియోయోనః ప్రచోదయాత్ ॥ యజు అ ౩౬. మం ౩ ॥

అర్థము:—ఓం, ఈ ఓంకారశబ్దము పరమేశ్వరునియొక్క సర్వోత్తమనామము దీనినే ప్రణవమందురు. అ ఉ మ్ అను మూడు అక్షరములు కలసి (ఓం) ఒక సముదాయమైన యీ యొక్క నామమునుండి పరమేశ్వరునియొక్క అనేక నామములు పొడము చున్నవి. ఎట్లనగా అకారము విరాట్, అగ్ని, విశ్వాది నామములకును, ఉకారము, హిరణ్యగర్భ, వాయు. తైజసాదినామములకును, మకారము ఈశ్వర, ఆదిత్య, ప్రాజ్ఞాదినామములకును వాచకములును గ్రాహకములునైయున్నవి. అట్లే వేదాదిసత్యశాస్త్రములందు స్పష్టముగా వాఖ్యానింపబడియున్నవి. ఇంక మూడు మహావ్యాహృతుల యొక్క అర్థము. వ్రాయుచున్నాడను, "భూరితివైప్రాణః, యఃప్రాణయతిచరాచరం జగత్ సభూః స్వయంభూరీశ్వః సమస్తజగత్తునకు జీవనాధారుడై ప్రాణముకంటె ప్రియుడై స్వయంభువగుటచే ప్రాణవాచకమగు "భూః' పరమేశ్వరునినామము (భువరిత్యపానః.) యఃసర్వం దుఃఖ మపానయతి సోపానః" సమస్తదుఃఖములచే రహితుడును అతని సంగతిచే జీవులును సమస్తదుఃఖములనుండి విడువబడుదురు. గనుకను పరమేశ్వరునకు "భువః' అనిపేరు. "స్వరితివ్యానః' యోవివిధంజగత్ వ్యానయతి వ్యాప్నోతిసవ్యానః, నానావిధమగు జగత్తునందంతట

వ్యాపించి అన్నిటిని ధరించియున్నాడు. కాబట్టి పరమేశ్వరునకు స్వః అనిపేరు ఈమూడువచనములును తైత్తిరీయ అరణ్యకపు 2 వ ప్రపాఠకములోని అయిదవ అనువాకము నందలివి (సవితుః) యఃసునోత్యుత్పాద యతి సర్వంజగత్ ససవితాతస్య సమస్త జగత్తును ఉత్పాదించి సమస్త ఐశ్వర్యము నిచ్చువాడును, (దేవస్య) యోదీవ్యతి దీవ్యతేవాసదేవః, సమస్త సుఖములనిచ్చువాడును, అందరిచేత గామింప బడువాడగు ఆపరమేశ్వరునియొక్క (వరేణ్యమ్) వర్తుమర్హమ్ స్వీకరించుటకు యోగ్యుడును అతి శ్రేష్ఠుడును- (భర్గమ్) శుద్ధస్వరూపం శుద్ధస్వరూపుడును, పవిత్రము చేయువాడును, చేతన బ్రహ్మస్వరూపుడైన (తత్) ఆపరమాత్మయొక్క స్వరూపమును మేము (ధీమహి) ధరేమహి, ధరింతుముగాక. ఎందుకొరకనగా (యః) జగదీశ్వరః, సవితయు దేవుడునగు పరమాత్మ (నః, అస్మాకమ్, మాయొక్క (ధియః) బుద్ధీః బుద్ధులను (ప్రచోదయాత్) ప్రేరయేత్. ప్రేరేపించునుగాక. అనగా దుష్టకార్యములనుండి వదలించి సత్కార్యములయందు ప్రవర్త పరచునుగాక.

తా॥ మన ఆత్మలకును బుద్ధులకును అంతర్యామి యగుటచే మనలను దుష్టాచారములనుండియు, అధర్మ మార్గములనుండియు తొలగించి శ్రేష్ఠాచారములందును, సత్యమార్గమందును ప్రవర్తింప జేయుటకు సమర్థులలో సమర్థుడును, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావుండును సమస్తజగములను ఉత్పాదించి తనయందు లయింప జేయువాడును, జననమరణాది క్లేశరహితుడును, జగన్నిర్మాతయు, శుద్ధస్వరూపుడును పొందుటకుగామించుటకు యోగ్యుడునుకళ్యాణ ప్రదుడగుటచే శివుడని నుతింపబడువాడును నగు ఆపరమాత్మను మనము ధరింతుముగాక. విశ్వామిత్ర గోరుదొమహర్షిః, అనుటచే ప్రపంచాతీతుడగు రుద్రునితో సమానుడును, నతనికంటే నధికుడునుగాని లేడు, కాబట్టి ఆపరమేశ్వరుని వదలి యితర దేవతలను ధ్యానింపకుందుము గాక.

ఓం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ప | రో | ర | భ | ధీ | ఓ | జ | సి | సా |
| | రోం | వ | ణ్యం | హి | యాత్ | దోం | వ | |
| | | స్సు | రే | మ | ద | మా | | |
| | | వా | ర్వ | ధీ | చో | య | | |
| | | | తు | స్య | ప్ర | | | |
| | | న | | శి | | మ | | |
| | | వ | వి | వ | నః | పో | | |
| | భూ | ర్భు | త్స | దే | యో | తీ | జ్యో | |
| హ్మ | బ్ర | తం | త | ర్గో | యో | మృ | సో | ర |

శ్లో॥ ఓంతత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి
ధియోయోనః ప్రచోదయాత్ । పరోరజసిసావదోం
ఓమాపోజ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోం

ఇట్టివిధముగా విడదీయుటకు వీలులేనట్టి గాయత్రీమంత్రి స్వరూపమగు భావముతోగూడియున్న శక్తిస్వరూపమగు చిచ్ఛక్తిని గలిగియున్న పరబ్రహ్మస్వరూపమగు లింగమును ధరించినపిమ్మట మరియొకగాయత్రిని ధరించుట శాస్త్రవిరుద్ధమని పెక్కు ప్రమాణములు గలవు. గ్రంథ విస్తరభీతిచే స్వల్పముగా నిచట వ్రాయబడును.

మనుస్మృతౌ॥ సర్వకర్మవిముక్తస్యధ్యాన యోగరతస్యచనతస్యదహానం కార్యం నచపిండోదక క్రియా । శివధ్యాన రతో భూత్వా శివలింగాంగ సంయుతః శివేతర పరిత్యాగీ ధ్యానయోగీ సఉచ్యతే॥

లింగధారి నిరాకారుడగు పరశివ పరబ్రహ్మమునకు సూచనగా ధరించిన లింగమందే దృష్టినిలిపి, పరశివునకు వేరేవస్తువుగాని, ద్వైతముగాని యున్నదని దలపక "ఏకమేవాద్వితీయంబ్రహ్మ "అనియు" ఏకఏవరు ద్రోనద్వితీయా యతస్తే అనియున్నది గనుక నేక దేవతోపాస్తిని గలిగియుండి, ప్రపంచమును మరచి పరబ్రహ్మమందే మనసు లయింపజేయవలెను. ఇకప్రపంచమును బోధించుటకుసూచనగానుండు 27 పోగులుగల నూలుజందెమును ధరించినయెడల నాగాయత్రిరూపమగు ప్రకృతిని విచారించునపుడు బ్రహ్మమునుండి మరలి నాశమగు ఈప్రపంచమే జ్ఞప్తిలోనుండుట సహజము. ఎందువల్లననగా గాయత్ర్యాగాయత్రీఛన్దో విశ్వామిత్ర ఋషిస్సవితాదేవతాగ్నిర్ముఖం బ్రహ్మశిరో విష్ణుర్హృదయగ్ం రుద్రశ్శిఖా పృథివీయోనిః ప్రాణాపాన వ్యానోదానసమానాసప్రాణా శ్వేతవర్ణాసాంఖ్యాయనసగోత్రా గాయత్రీచతుర్వింశత్యక్షరాత్రిపదాషట్కుక్షిః పంచశీర్షోపనయనే వినియోగః)

బసవపురాణే॥ సీ॥ గాయత్రి కగ్నిముఖయు బ్రహ్మశిరమాది రుద్రుండు శిఖమావరుండు హృదియు,

వసువులు ప్రాణాదివాయుపంచకమిల యోనివర్ణము దెల్పు దానిగోత్ర

మరయసాంఖ్యాయనం బక్షరంబుల సంఖ్య యిరువదినాల్గు మూడెనగుపాద

ములుకుశసులావుతలలు బాణసంఖ్యలునని జెప్పుగాదె మీ

యాజ్ఞికమున,

గీ. గానశివభక్తికిని బ్రాహ్మ్యగతికిసకల
కర్మములు వేరవేరె యూ గాదొ దైవ
మనగలేదొండు నదియు సాంఖ్యాయనోక్తి
దానిసాంఖ్యాయనుడు జెప్పెదద్గురుండు

గీ॥ తానుసాంఖ్యాయన మతప్రధానకర్మ
జమడు తత్రోప్యచ్య మానవిశ్వస్వరూప
సహితబహుదేవతో పాస్తి సరణియైన
యట్టిగాయత్రి శివభక్తి కనుమతంబె!

ఇట్లు వర్ణింపబడిన యీ దేతా నుష్ఠానమునందు సర్వదేవతా స మత్వ బుద్ధితో చేయుదమన్నను, పెక్కునామములు, పెక్కుకర్మలు వేరువేరుగా విధించబడియున్నందున లింగార్చన విధానమునందు ఒక్కడే దేవుడగుపరబ్రహ్మము జ్ఞప్తిలోనుండునటుల నుండక వేరువేరు కర్మలు చేయుచు వేరువేరు నామము ఉచ్చరించుచుండుటచేత పరశివు నకు వేరుగా పెక్కు దైవములున్నట్లు తోచుచుండును. మరియు గాయ త్రి దేవతను మంత్రములో స్త్రీరూపముగా వర్ణించుటవల్ల పురుషస్వ రూపుడగు పరశివునకు వేరు స్వరూపమని తోచుచుండును మరియు విశ్వరూపముగా వర్ణింప బడుటవలన నాశనమగు ప్రకృతియే తోచు చుండును.

లింగ పురాణమందు శ్లో॥ శివలింగం పరిత్యజ్య యోన్యదైవ ముపాస్యతే ప్రసాద నిష్ఫలస్తస్య రౌరవం నరకం ధ్రువమ్.

శైవపురాణమందు శ్లో॥ ప్రాణలింగార్చ నంత్యక్త్వా గ్రామలిం గస్య పూజనంశ్వానయోనిశతంగత్వా చండాల గృహమాచరేత్.

అని వేదాగమ పురాణములు బోధించుచున్నవి గావున లింగాంగి అన్య దేవతను పూజింపకూడదు.

మరియు శివరహస్యఖండే శ్లో॥ యోవిప్రి సర్వచిహ్నానిధార యంత్య విమోహితః సపాషండ ఇతిజ్ఞేయ స్సర్వకర్మసునిందితం.

తా॥ ఏవిప్రుడు అజ్ఞానముచేత అనేక చిహ్నములు ధరించునో అతడు పాషండుడనియు, సర్వకర్మలయందు విడువదగిన వాడనియు యర్థము. మరియు॥ అమరము॥ పాషండస్సర్వ లింగినః

శ్రు॥ యోవైస్వాం దేవతా మతీయజతే ప్రిస్వాయై దేవతా యైచ్యవతే నవరాంప్రాప్నోతి పాపీయాన్భవతి.

తా॥ ఎవడు తన ఇష్టదైవము నతిక్రమించి అన్యదేవతలను బూజించునోవాడు నరకమును బొందును. అత్యంతపాపిష్ఠియగును. అని శ్రుతిబల్కుచున్నది.

బ్రిహ్మగీతలందు శ్లో॥ శివపూజా పరోభూత్వా అన్యదైవంచ సంస్మరేత్ అష్ట వింశతి కోట్యంచ నరకేయాత నాధ్రువమ్.

కావున ఏకలింగైక్య నిష్ఠావరులైన లింగాంగి ఎన్నడును లింగమును ధరించి రెండవచిహ్నమగు జందెమును ధరించకూడదు అట్లు ధరించిన పాషండుడగును.

ప్రికృతి స్వరూపగాయత్రి మంత్రానుష్ఠానవరునకు వేదమునందు 16 కర్మలు విధించబడినవి. అంత్యమందు 16 వదియగు దహనసంస్కారము చేయవలసియున్నది.

శాతాతవస్మృతౌ॥ వానప్రస్థం యోగినంచ లింగైక్యం భిక్షు కంయతింతుర్యాశ్రిమాణాం మధ్యేచరసాయాం నిత్యపేత్స్మృతం॥

అనియుండుటచే లింగాంగిని అంత్యమందు ఖననము చేయవలసియున్నది, లింగమును జందెమును ధరించినవారికి పరస్పర విరుద్ధములగు రెండుకర్మ లు అనగా ఖననము, దహనమును జరిగించుటపొసగనేరదు. ఏదిమాని నను శాస్త్రవిరుద్ధమైకర్మభ్రష్టుత్వమునంభవించును. అట్టివాడు పాపం డుడనబడును.

మరియు దేవాంగపురాణే॥ వేదోక్తమూల స్తంభమునందు

శ్లో॥ యజ్ఞోపవీతమా త్రేణ । బ్రహ్మత్వం నైవసిధ్యతి॥

తా॥ యజ్ఞోపవీతమును ధరించినంతమాత్రము చేత బ్రహ్మత్వము సిద్ధింపదు। జ్ఞానము కలిగియుండవలెనుఅనగా మాయాప్రపంచమును బోధించు ప్రకృతియజ్ఞోపవీత ధారణవల్ల లాభములేదు గనుక

శ్లో॥ శుద్ధమాయా సమాయుక్తం । బ్రహ్మణా నిర్మితంపురా సూత్రేణరుద్రసంయుక్త । ముపవీతం తుధారయేత్॥

టీ॥ బ్రహ్మణా నిర్మితంపురా పూర్వము బ్రహ్మచేత నిర్మింపబ డినట్టియు శుద్ధమాయాసమాయుక్తం నిర్మలమాయయగుశక్తితోగూడి నట్టియు రుద్రసంయుక్తం సంసారదుఃఖమును పోగొట్టునట్టి రుద్రుడగు శివునితోగూడినట్టియు ఉపవీతం పరశివతత్త్వమును బొందించులింగ మును సూత్రేణ జ్ఞానసూత్రముచేత ధారయేత్ । ధరించవలెను అని నిర్ణయింపబడినది ఉపవీతమనగా లింగమని చెప్పుటకు కారణమేమ నగా నిర్మలమాయయగు శక్తితోనున్న రుద్రుడగు శివునితోనున్న గూడియున్నట్టి యుపవీతమనియిట్లు శివశ్శక్త్యు భయాత్మకముగా నుపవీతము వర్ణింపబడినది గనుకనుపవీతమనగా లింగమని యర్థము గనుక నిట్టిలింగమునకు సూచనగా యేర్పరచబడిన శిలాలింగమును జ్ఞానసూత్రమునకు మారుగా కార్పాససూత్రముతో అనగా ప్రత్తితో వడకబడిన సూత్రముతో ధరింపవలెను.

గాన ముముక్షువులు రెంటిని ధరించక లింగమన్నను, యజ్ఞోపవీతమన్నను, త్రివృత్సూత్రమన్నను ఉపవీతమన్నను తాత్పర్యమొక్కటియే గనుక లింగమును మాత్రమే ధరించవలెను. అట్టి లింగమును ధరించి జ్ఞానాభివృద్ధికొరకు నాలింగమును బూజించుచు షట్స్థలజ్ఞానమును బడసి యాలింగమునందే మనసులయింపజేసి మోక్షమును బొందవలెను. మరియు షట్స్థలజ్ఞానాభివృద్ధికలుగు మార్గమును దెలిసికొనుట మొదలగు పెక్కు వివరములను దెలియగోరువారు శైవసిద్ధాంతశిఖామణిమహాలింగలీల వీరశైవోత్కర్షసంగ్రహమను గ్రంథముల పరిశీలనజేసి తెలుసుకోవలెను మోక్షప్రదమగులింగమును ధరించిన వారికి లింగమును బూజించు పద్ధతి యొకవిధముగను జన్మకారణమగు 27 పోగులుగల జందెమును ధరించినవాని కర్మానుష్ఠాన పద్ధతి మరియొకవిధముగను విధించబడినందునపరస్పరవిరుద్ధములగుపూజలవల్ల ఏకదేవతోపాసనములభ్యముగాక నుభయభ్రష్టుడగును. గనుక జన్మరాహిత్యమును బొందించు లింగదీక్షనుబడసి బ్రహ్మమగు లింగమును పూజించుచు జీవబ్రహ్మైక్యసిద్ధిని బడయవలయును.

—◆ గద్య ◆—

శ్రీమత్పరమపావనపంచముఖ పరశివ సద్యోజాత ముఖోద్భవ
శ్రీమద్వీరశైవ ఘనమత స్థాపనాచార్యవర్య, శ్రీమదంభాపురీ
ధర్మ సింహాసనాధీశ్వర, జగద్గురుచరపట్టాధ్యక్ష శేవణ సిద్ధరాజ
దేశికేంద్రోప మఠాధ్యక్ష శ్రీమదాద్రిజా చేబ్రోలుసింహాసన
కారణకర్త రాదపట్టద ప్రసన్నదముమ్మడి సిద్ధశంభు స్వామి
శిష్య బసవశంకరశాస్త్రిణా స్తృతీయపుత్రేణ
చదువుల కోటయ్యశాస్త్రిణా విరచితమ్॥
సద్గురులింగార్పణమస్తు.
లింగయజ్ఞోపవీతం
సంపూర్ణము.

———

ఓం.

శ్రీ శివాయనమః

# మహాలింగలీల.

జీవుడు తాను పూర్వజన్మమందు అనేక పుణ్యకార్యములను జేసియుండుటవల్ల నీజన్మమందు పరిశుద్ధాంతఃకరణగలిగి దుష్కార్యములను జేయవలయునను తలంపుతగ్గి బీదలకన్నదానము జేయుట, రోగులకు మందులనిప్పించి యారోగ్యవంతులనుగా జేయించుట, విద్యాదానము చేయించుట, సత్యము, క్షమ, దయ, శౌచము, నియమము, మృదుసంభాషణము, తపస్సు, త్యాగము, బ్రహ్మచర్యము, సంతుష్టి, ఆర్జవము, అహింస, మాంసభక్షణమునువిడుచుట, ఇత్యాదిసద్గుణములుగలిగి సత్క్రియల నాచరించుచుభస్మరుద్రాక్షధారణము మొదలగు సదాచారములను కలిగియుండుటవలన గ్రమముగా బుద్ధివికసించిరొక తలంపుకలుగును. అదియేమనగా ఈశరీరము తనంతటతాను కదలుట, మెదలుట, తిరుగుట మొదలగుపనులను జేయలేదు. నేనెవరో యీశరీరమునందున్నాను. నేనెవడనో నాకు తెలియదు. ఈశరీరమునకు కాళ్లు చేతులు మొదలగుకొన్ని యవయవములున్నవి. అవి నేనెటుల చేయించిన నటులచేయుచున్నవి. నేనుండిచేయించని యెడల నటులచేయలేవు. ఈవిషయమాలోచించగా నొకడొక గృహమునుకట్టించి యాగృహమున నింకొకనిని ప్రవేశపెట్టునట్లుయీదేహము నెవరోనిర్మించినన్నిందులో ప్రవేశపెట్టునట్లుగాదోచుచున్నది. ఆగృహము కదలలేదుకాని యీదేహము నావలనకదలుచున్నది. ఈదేహముకదలించుట మెదలించుటమొదలగు చిత్రమైనపనులుచేయించునట్టి శక్తినిగలనన్నీ శరీరమందు ప్రవేశపెట్టుటమొదలగు ఘనకార్యమునుచేసినవాడొక డున్నాడని తోచుచున్నది ఇదివరకునాకీవిషయమేగోచరించెడిదికాదు. నేనుసత్క్రియల నాచరించిన కొలది కొన్నియూహాలుతోచి యిప్పటికి నీయూహ

స్ఫురించినది. అత డెవ్వరో తెలుసుకొనవలెనని యున్నది. అనియుచుకొని తెలుసుకొనెడి ప్రయత్నములో నుండును.

ఒకనిచేగుర్తించబడిన దానికి గురుతుఅనిపేరు. గురుతుఅనగా చిహ్నము. చిహ్నముఅనగా లింగము.

## ఆ చా ర లిం గ ము.

సదాచార సంపత్తిని గలిగి ఆస్తిక్యబుద్ధిచేతయేదో యొకటి యున్నదని గుర్తింప బడినదానికి ఆచారలింగమనిపేరు. భూమిసమస్తవ్యాపారములకు నాధారమైయున్నటులనే ఆచారలింగము సమస్తమగుసత్క్రియలకు నాధారమై యుండుటవలన నాధారచక్రస్థానమగు పృథ్వీతత్వముతో పోల్చడమైనది.

## క్రి యా శ క్తి.

అధోముఖమును గలిగి యుండుటవలన జీవుడను సంజ్ఞను గలిగి తాను జేయు పనులు మంచివియో, చెడ్డవియో దెలియకుండా క్రియలను చేయుశక్తికి క్రియాశక్తియని పేరు.

## స ద్భ క్తి.

ఊర్ధ్వముఖమును గలిగి యుండుటవలన జీవుడు అంగమను సంజ్ఞను గలిగి తానుజేయు పనులను యివి మంచివి యివి చెడ్డవి యను గురుతు నెరిగి సత్క్రియలను జేయు శక్తికేసద్భక్తియనిపేరు.

## భ క్త స్థ ల ము.

సత్క్రియల నాచరించుచు పైని జెప్పబడిన ఆచారలింగమును దెలుసుకొనవలయునని ప్రయత్నముజేయు స్థితికి భక్తస్థలమనిపేరు ఒకడు తనకు తెలియని క్రొత్తవిషయమును తెలుసుకొనుటకు అదివరకు నా విషయమును దెలిసియున్న మరియొకనియొద్దను దెలిసికొనవలెనని యతని వద్దకు వెళ్ళి యతని నాశ్రయించి గురునిగా భావించి పూజించి యతనివద్ద నెటుల దెలుసుకొనునో అటువలెనే భక్తుడు సదాచార సంపత్తిలో నున్నపుడు గుర్తించిన యాచారలింగము విషయమై

దెలిసియున్న వానిని వాళబుచేసి వానికడకేగి వానిని గురువుగా భావించి పూజించి యాగురువుతో, అయ్యా!, జడమగు నీశరీరములో నుండి దీనిచే పనులను చేయించు నేనెవరనో నన్నీ దేహములో ప్రవేశపెట్టిన వారెవరో దెలియ గోరుచున్నానని సంశయమును దీర్పుమని ప్రార్థింప నాగురుడు, "శిష్యా ! నీచేత కర్త్రించబడిన వాడు దేవుడు, అతని సంగతిజెప్పెద వినుమని యాగురుండు హస్తమస్తక సంయోగమును జేయుటకై తన దక్షిణహస్తము బైకెత్తుచు " శిష్యా జడమగు నాశరీరములోని నాహస్తము నెవనిశక్తివలన పైకెత్తుచున్నానో అతనికి దేవుడనియు లింగమనియు పేరు. ఎందువలననగా వినుము యజుర్వేదేశ్రుతి॥ సర్వలింగగ్ం స్థాపయతి యనుతైత్తిరీయోపనిషత్తు వాక్యము ననుసరించియు, శ్లో॥ లయంగచ్ఛతి యత్రైవ। జగదేతచ్చరాచరం। పునఃపునస్సముత్పత్తిం। తల్లింగం బ్రహ్మశాశ్వతం॥ అనుపురాణ వాక్యము ననుసరించియు లీనమర్థం గమయతీతి లింగం॥ లయం గచ్ఛత్యస్మిన్నితి లింగం॥ అనువ్యుత్పత్తుల ననుసరించి సర్వపదార్థములయందు నేవస్తువు లీనమైయున్నదో సర్వపదార్థములు యేవస్తువునందు లయమును బొందుచున్నవో దేనియందుత్పత్తిమై గమించుచున్నవో ఆవస్తునకు లింగము. బ్రహ్మము. దేవుడు పరశివుడు మొదలగు నతని లక్షణములను బోధించు పెక్కు నామములు కలవు. మరియు నా వస్తువును జ్ఞప్తిచేయునట్టిదియు కూడా లింగమనబడును.

అట్టి పరబ్రహ్మ స్వరూపమునందు అగ్నియం దుష్ణమును చంద్రునియందు చంద్రికయును నెటుల విడదీయుటకు వీలులేనట్టులున్నవో అటువలెనే అభిన్నమగునట్టియు సర్వమును దెలుసుకొనునట్టియు జ్ఞానమే స్వరూపమగు చిచ్ఛక్తి కలదు. సాలెపురుగు తన శరీరములోని తనకన్యముగాని పదార్థముతో నూలుదీసి దానితో గూడునల్లి యాగూటిలో ప్రవేశించి పలువిధములైన పనులను జేయుచుండును. అటువలెనే ఆ పరశివుని సంకల్పము వలన నాపరశివాభిన్న

మగు చిచ్ఛక్తి తన కన్యముగాని తనలోనిమిడియున్న సత్వరజస్తమో
గుణములను వాటిని సమ్మేళనముజేసి అనేక విధములయిన బ్రహ్మాండ
ముల నిర్మించి వానిలో తాను పరశివాభిన్నముగా ప్రవేశించి
పలువిధములైన పనులను జేయుచుండును. ఈ శరీరములుకూడా ఆ
సృష్టిలో జేరినవే అయియున్నవి మేఘమునందుండు జలము వర్షధార
రూపముగా భూమిమీద నొకచోటున పడి పిమ్మట నాభూమి
మీద ప్రవహించును. అటువలెనే అణువులో 12 వ భాగము పరి
మాణముగల జ్ఞానస్వరూపమగు చిచ్ఛక్తియొక్క అంశము శరీరము
యొక్క ప్రధానాంగమగు శిరస్సునందు బ్రహ్మరంధ్రముగుండా
ప్రవేశించి సహస్రార చక్రమున నుండును అట్టి చిచ్ఛక్తియొక్క
అంశమగు తెలివిలో పరశివ స్వరూపము లీనమయ్యే యుండును. ఆ
పరశివస్వరూపము నిర్వికారము గనుక నేపనియు జేయక నచలమై
యుండును. చలనము లేని సూదంటు రాయివద్దనుండు ధృఢమగునట్టి
ఇనుపముక్కకు చలనము కలుగును అటువలెనే తనలో పరశివ
స్వరూపమును గలిగియున్న యాచిచ్ఛక్తియొక్క అంశమగు తెలివికి
చలనము కలుగును. ఒక గృహమున నొక గూటిలోనుండు దీపపు
ప్రకాశ మా గృహము నందంతట వ్యాపించినట్లు సహస్రార చక్ర
మున నున్న పరశివయుక్తమగు నీచిచ్ఛక్త్యంశముయొక్క వ్యాపారము
శరీరమందంతటను వ్యాపించును పరశివ యుక్తమగు నీచిచ్ఛక్త్యం
శము బహుస్వల్పమును దానిలోని వ్యష్టిభాగమును అయియున్నది
ఈచిచ్ఛక్త్యంశము పంచభూతాత్మకమైన శరీరములో జేరి యచ్చట
కొంత వ్యవహారమును గలిగి యున్నందున దీనికి జీవచైతన్యమని పేరు.
ఈజీవచైతన్యముయొక్క వ్యాపారమంతయు నయస్కాంతపురాయివద్ద
నుండెడి యినుము చలించినట్టుల పరశివుని సన్నిధానమున చిచ్ఛక్తి
యొక్క అంశము జేయుచున్నదని గ్రహించవలెను అట్టి జీవ చైత
న్యముయొక్క శక్తివల్లనే నాచేతిని పైకెత్తుచున్నాను. ఆపరశివయుక్త
చిచ్ఛక్త్యంశమగు జీవచైతన్యమే నీశరీరమందు నాచేతిలో నిపుడు

నీకు చూపబడు బ్రహ్మరంధ్రముగుండా ప్రవేశించి సహస్రార చక్రమున నున్న దని చెప్పుచూ గురుడు తనకుడి చేతిని పైకెత్తి శిష్యుని మస్తకమున బ్రహ్మరంధ్రముండెడు చోటున నుంచి హస్తమస్తక సంయోగము జేసి తనచేతియందును శిష్యుని సహస్రార చక్రమందును సర్వజగత్తునందునులీనమై యుండుటవలన లింగమని పేరుగలిగి యున్న దని చెప్పి మరియు నిట్లని బోధించును ఈఘటమున సహస్రార చక్రమునందునయు ఆసహస్రార చక్రమున పరశివాభిన్నమగు చిచ్ఛక్తియొక్క యంశముండుననియు నందులో పరశివుని చైతన్యము లీనమై యుండుననియు పైన జెప్పబడి యున్నది సహస్రార చక్రమున నుండు చిచ్ఛక్త్యంశము నిత్యసంకల్పుడగు పరశివునియొక్క యిచ్ఛవలన నాపరశివునిలో అధోముఖముగా నుండునపుడు దాని యధోముఖమగుటయను పనివల్ల అవిద్యయనియు కారణశరీరమనియు చెప్పబడు శరీరమేర్పడును ఆచిచ్ఛక్తియొక్క అంశమూర్ధ్వముఖముగా నుండునపుడు దాని యూర్ధ్వముఖమగుటయను పనివల్ల విద్యయనుయోగాంగమగును. ఈ కారణశరీరమునకు యేయింద్రియములు లేనందున యేయింద్రియ వ్యాపారములు నుండవు పరశివస్వరూపము తనలో లీనమైయుండునప్పటికి అధోముఖమగుటవలన యీచిచ్ఛక్త్యంశము మత్తును గలిగి నిద్రవచ్చి కొంతసేపు తానుండియుచున్నట్లు తోచక జడస్వభావమును పొంది యుండును. కొంతసేపు తాను పరశివున కభిన్నముగా నుండునట్టి చిచ్ఛక్తియొక్క అంశమును అను విషయమేతోచకస్వతంత్రముగా తానొక వస్తుస్వరూపముగనున్నానని నుకొనుచూ నుండును కాని తా నెవరో తనను తాను తెలుసుకోలేని స్థితిలో నుండును సరేకదా సూక్ష్మస్థూల దేహములలో తా నెటుల ప్రవేశించియుండునదియు తెలియని అజ్ఞానావస్థలో నుండును. ఇట్టి స్వల్ప విషయములలోనే జ్ఞానము కలిగియుండని అధోముఖ శక్తిమహద్వస్తువు అని చెప్పుటకు వీలులేదు పూర్వజన్మపుణ్యముచే బ్రహ్మవిద్యాభ్యాసము వల్ల నూర్ధ్వముఖమును గలిగిన ఈపరశివాభిన్న చిచ్ఛ

క్త్యంశము నిద్రిలోనున్నప్పుడు తానుండియు నున్నట్లు అనుభవ ము వల్ల తెలియకపోయినవిధమునగాక తెలివియగు తాను మాత్రమున్నట్లు తోచుచుండును. దీనికి యేయింద్రియములు లేనందున ఇంద్రియ వ్యాపారములు తోచవు మరియు కొంతసేపు తాను పరశివాభిన్నమగు చిచ్ఛక్తి యొక్క అంశమును అనియు ఆచిచ్ఛక్తి పరశివునకు అభిన్నముకాబట్టి తానుకూడా పరశివున కభిన్నమునే యనియు నందువల్ల తాను పరశివ స్వరూపమేయను అనుభవమును కలిగి తనను తాను చూచుకొనుచు ఆనందమును బొందుచుండును. అట్లు తానును పరశివా భిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశమునే కాబట్టి పరశివున కన్యమయిన పదార్థమును కాననే భావమును గలిగి పరశివునియందు లయమై యుండును.

## భావలింగార్చనము

వజ్రిమును వజ్రిముతోనే కోయవలయునుగాని యితరమైన రత్నములతో గాని పదార్థములతో గాని కోయుటకుసాధ్యపడదు అటులనే ఆ పరశివ స్వరూపమును ఆపరశివునకు వేరుకాని చిచ్ఛక్తియొక్క అంశమగు తెలివితోనే తెలుసుకోవలయును. కాని మరియొక విధమున సాధ్యము కాదు. చీకటిలోనుండు వస్తువులను దీపపు ప్రకాశమువలన తెలుసుకోవచ్చును గాని యాదీప ప్రకాశమును ఆవస్తువులు తెలుసుకొనలేవు. అట్లన్ని వస్తువులను తెలివిచే దెలుసుకొనవచ్చును గాని యా తెలివిని యేవస్తులును దెలిసికొనలేవు. అట్లు జ్ఞానమే స్వరూపముగాగల పరశివుని అత౦కభిన్నమగు చిచ్ఛక్తియొక్క యూర్ధ్వముఖాంశమువల్లనే తెలుసుకోవలసియున్నది, ఇది యూర్ధ్వముఖమైననూ యేయింద్రియములు లేవు. కావున నింద్రియవ్యాపారములు తోచక చూచునట్టిపరశివయుక్తచిచ్ఛక్త్యంశమగు తానున్న, తనచేచూడబడు తననిజరూపమగు పరశివాభిన్నమును జ్ఞానస్వరూపమునునగు పరశివయుక్త చిచ్ఛక్తియున్నూ మాత్రిమే అనుభవములో తోచుచు నొకడు అద్దములో తన ముఖమును తాను చూచుకుని యానందించునటుల నా పరశివయుక్తచిచ్ఛక్త్యంశము తననిజరూపమగు పరశివాభిన్న పరశివ

యుక్త చిచ్ఛక్తిని జూచుకొని యానందించి తృప్తిని బొందుచుండును అధోముఖమనగా ప్రపంచమువైపు దృష్టిని కలిగియుండుట ఊర్ధ్వ ముఖమనగా బ్రహ్మము వైపునకు దృష్టిని కలిగియుండుట దృశ్యమగు స్థూలశరీర సంబంధమగు తనముఖమును దృశ్యపదార్థములో చేరిన అద్దమందు జూచుకొనియానందించునటుల అదృశ్యమగుతననిజరూపమును జూచుకొనవలయుననిన అదృశ్యమగు తన తెలివియందు తనను తాను జూచుకుని యానందించవలయును. ఇది భావలింగార్చనము.

ఈచిచ్ఛక్తియొక్క అంశము అధోముఖమగుటవల్ల అవిద్యయగు కారణ శరీరమందు నుండునపుడు నిద్రవచ్చి మత్తుగానుండి తానున్నప్పటికీ ఉన్నట్లు అనుభవమును కలిగియుండదు. అట్లుగాక నా కారణ శరీరమందే ఒక్కొక్కప్పుడు నిద్రయును మత్తునుగాక తెలివిలోనుండి తానున్నట్లు అనుభవమును గలిగియుండియు తానెవరో తనను తాను తెలుసుకొనలేని స్థితిలోనుండును. దీనికే పరశివాభిన్న అధోముఖచిద్బిందువు అనియు పరశివయుక్తమగుటచేత చిద్బిందు చైతన్యమనియు పేరు ఈచిద్బిందు చైతన్యమే ప్రాణ చైతన్యమగును. పరశివాభిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశమగు నీ చిద్బిందువు అధోముఖముగా నుండుటవల్ల తానెవరో తనను తానుదెలుసుకొన లేదుగాని తెలివిని గలిగియేయుండును. అపుడు ఆ తెలివి యాకాశమువలె కదలక మెదలక యుండును పిమ్మట వాయువువలె కదలిక గలిగి వ్యాపించును. అట్లువ్యాపించుచు అది యట్టి వస్తువు, ఇది యిట్టి వస్తువు అని తెలియుట మూలముగా అగ్నివలె నా తెలివి ప్రకాశించును. అట్లు తెలుసుకున్న జ్ఞానానుభవ మనియెడు రుచియే ప్రధానమగు నుదకతత్వమునుబోలి అనుభవరుచి గలిగి యాజ్ఞాన రుచ్యనుభవమువల్ల హాయిచిక్కి భూమివలె నాచిక్కిన హాయిస్థిరమైయుండును. తనలోనిమిడి యుండునట్టి యిట్టివిధమగు వ్యాపారమునుగల ఈపరశివయుక్త చిద్బిందువునకు ఒకపక్షికి గూడు యెటుల నుండునో అటులనే సూక్ష్మ శరీరముండును. ఆసూక్ష్మశరీరము మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అను సంతరింద్రియములు, సమానము, వ్యానము

ఉదానము ప్రాణము అపానము అను పంచప్రాణములు, శ్రోత్రము, త్వక్కు, చక్షువు జిహ్వ, ఘ్రాణము అను జ్ఞానేంద్రియములు వాక్పాణిపాద గుహ్యగుదములను కర్మేంద్రియములు అను పనిముట్లను గలిగి యుండును. ఇది పరశివున కభిన్నమగు చిచ్ఛక్తియొక్క తమోగుణ సంభూతములగు నపంచీకృత పంచభూతముల యొక్క సూక్ష్మాంశములు ఆచిచ్ఛక్తియొక్క సత్వరజో గుణములతో కూడి యేర్పడి యుండును. ఇచటనుండెడి యింద్రియములకు రాజగు మనస్సుగా సూక్ష్మదేహము సందగ్ర భాగమున నుండును. ఈ చిద్బిందు చైతన్య మా మనసుయొక్క శిరస్సున నివసించి సూక్ష్మశరీర సంపర్కమున ప్రాణమై పరశివయుక్తమై యుండుటవలన ప్రాణచైతన్యమను పేరునుబొంది సూక్ష్మశరీరమునజేరి చలించుచు నధోముఖమై యుండుటవలన తాను సూక్ష్మశరీరమున చేరి చలించుచు దానా సూక్ష్మశరీరములో నెటుల ప్రవేశించెనో ఆసంగతినిన్ని ఆ సూక్ష్మరూప మగు శ్వాసముల నెటుల నడుపుచుండెనో ఆ విషయమున్నూ తెలియకుండా నుండును. మరియు సూక్ష్మశరీరమందు మనసుతో గూడి అనేక విధములయిన సంకల్పములను జేయుచు ఆ సంకల్పించు తానెవరో యా సంకల్పము వలన కలిగిన విషయభోగములు నెవరు పొందుచున్నారో ఆసంకల్ప గోచర మగు పదార్థములలో నెవరు లీనమైయున్నారో తెలియకుండా యుండును. ఒక్కొక్కపుడు కారణశరీరమందు నిద్రవచ్చి నపుడు మత్తుగా నుండి యేమియు దెలియక యుండునటువలె నుండక సత్యముగను అసత్యముగను యెఱుగబడుచును యెఱుగబడకను చిత్రముగా దోచునట్టి స్వప్నమును గలిగియుండును. ఇట్లు సూక్ష్మశరీరమందు లోపలి భాగము నందుండి నపుడు పైన వ్రాయబడిన విధమున వ్యాపారమును గలిగియుండి అందునుండి పైకి నధోముఖముగానే యెక్కి యాసూక్ష్మశరీరాగ్రభాగమున నధోముఖముగా దానినిచేరియే యుండును. తిరిగీయధోముఖముగానే సూక్ష్మశరీరములోజేరి యచ్చట

వ్యాపారమునుగలిగియుండును. ఇట్లు వ్యాపారములను జేయుచున్నపుడు
ప్రాణమందుండు పరశివ స్వరూపమునిర్వికారము గనుక యేమియు
జేయక అచలమైయుండుననియునాపరశివ సన్నిధానమున ప్రాణమై
యుండు చిచ్ఛక్త్యంశము చేయుచున్నదనియు దెలియవలెను. ఈసూక్ష్మ
శరీరమందున్నపుడు ప్రాణము బ్రహ్మవిద్యాభ్యాసము వల్ల నూర్ధ్వముఖ
మయినయెడల తాను పరశివాభిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశము
ననియు పరశివ యుక్తముగా నతని యిచ్ఛవల్ల నీ స్థానమందు నివసించి
యున్నాననియు, తాను పరశివాభిన్న మగుటవలన నచటి యింద్రి
యముల చేత తానునడిపించు వ్యాపార మంతయు పరశివునిదే యని
యు మరియు నామనస్సు మొదలగు యింద్రియములవల్ల కలుగు విష
య భోగమంతయు పరశివునిదే యనియు నూహించుచుండును.
బ్రహ్మవిద్యాభ్యాసము లేనియెడల ప్రాణమధోముఖమును గలిగి
యుండిపరశివ స్వరూప మనునది యున్నదనియు తానాపరశివస్వరూప
ము లీనమయియున్న పరశివాభిన్న చిచ్ఛక్త్యంశ మను విషయమే
తెలియక తానెవరోయున్నట్టున్న ఆసూక్ష్మశరీర మందలి మనసు
మొదలగు నింద్రియముల వలన గలుగు భోగము లన్నియు తనవేయ
ని యనుకొనుచు వాటివలన గలుగు కష్టములు తనవే యనుకొని దుః
ఖించుచు అవి నివారణ యగు దారి గానక తహ తహపడుచుండును.
కనుక తన్నివారణార్థమై యొకడు నిద్రబోవుచుండిన యెడల పదే
పదే లేపి మేలుకొలిపినటుల నధోముఖమగునపుడు బ్రహ్మవిద్యాభ్యా
సముచే నూర్ధ్వముఖమగునటుల చేయవలయును. అభ్యాసమువల్ల నటు
ల జరుగును. ఒక పశువును సాయంత్రమునందొక కొయ్యకు కట్టి యు
దయమున విడిచి, మరల సాయంత్రమునందుకట్టుచు, నిటుల కొద్దిరో
జులుచేసిన యెడల కొన్నాళ్ళకది యాకట్టుకొయ్యవద్దకుసులభముగావచ్చి
నిలుచును, అట్లు ప్రాణమధోముఖమగునపుడు విద్యాభ్యాసముచే నూ
ర్ధ్వముఖమును జేయుచుండిన యెడల నభ్యాసమువల్ల క్రమేణ సులభ
ముగా నూర్ధ్వముఖమగును. ఎటుల జేయవలయు ననగా తాను పైన

జెప్పబడిన ప్రకారము పరశివున కభిన్నమగుట వలన తాను జేయునట్టి సంకల్పములువగైరాపనులన్నియు పరశివుని వేయనియునాయింద్రియము లవల్లగలుగుభోగములన్నియు పరశివుని వేయనియునూహించు చుండవలెను. మరియు నొకని తాలూకు భృత్యుడు జేయు వ్యాపారములోని ప్రతిఫలమంతయువాని యజమాని దేయనినిశ్చయించివాడెటులతనదికాదనుకొనునో యటులనే ప్రాణముతాను జేయు సంకల్పములువగయిరాల వల్ల గలుగు భోగములు తన నిజరూపమగు పరశివుని వేయని నిశ్చయించ వలెను. మరియు. నా భృత్యుడు వ్యవహారమును చేయునపుడు ప్రతివిషయము నందును వ్యవహారమును తాను నడుపుచుండినను వాని లక్ష్యము తన యజమానుని ప్రత్యక్షముగా నెరిగియున్నట్లయితే యతని యాకారము మీాదనున్నా నెఱుగని యెడల నతని యజమాని దేయను నూహామీాదనున్నా నెటుల నుంచునో అటులనే ప్రాణము తాను జేయు సూక్ష్మశరీర వ్యాపారమందు తన యజమానియు నిజరూపుడునగు పరశివుని యందే లక్ష్యమునుంచవలయును. సూక్ష్మశరీరమందు శ్వాసములు సూక్ష్మరూపములై తన మనస్సంకల్పములలో మిళితమై నడచుచుండును. పరశివాభిన్నమగు తానుండి నడుపుటవల్ల నడచుచున్న వని యూహించ వలయును ప్రతివిషయము నందును పరశివుని స్వరూపము జ్ఞప్తిలోనుంచి తప్పిపోకుండా రూఢిగలుగుటకై యతడక్షరుడు అనగా నాశములేనివాడు, నిరాకారుడు అనగా ఆకారము లేనివాడును అనెడి యర్థము లిచ్చునట్టివై తమవలెనే పరశివుడు అక్షరుడు నిరాకారుడు అని జ్ఞాపకము చేయుటకు సాధనములైనట్టివియు పరశివుని లక్షణమును దెలుపునట్టివియు నగు గొన్ని యక్షరములతో మంత్రము నేర్పరచి వాటిని మననముజేయుట మూలముగా అభ్యాసము చేసిన యెడల నా పరశివస్వరూపమునకు గుర్తుగా నుంచబడినట్టి యా మంత్రాక్షరములే మనసునకు గోచరించుచుండును. ఆ మంత్రాక్షరములు పరశివతత్వమును బోధించుటకును అతని జ్ఞాపకమును చేయుటకును సూచనగా యేర్పడి అతనికి పెట్టబడిన

పేరుగలవిమై యుండుటవల్ల ఆమంత్రమును మననము చేయునపుడు పరశివతత్త్వమే మనసునకు గోచరమగును. ఎట్లనగా ఒకనికి కొన్ని యక్షరములతో పెట్టబడిన నామము నొకపుస్తకములో చూచినపుడు గాని విన్నపుడుగాని యా పేరుగలవాని స్వరూపము నదివరకు చూచి యున్నయెడల నాతని స్వరూపమున్నూ అట్లు చూచియుండని యెడల నా పేరుగలవాడెవ్వడయి యుండునాయని యతని గురించి యతని మీదనే యొక విధమయిన ధ్యానమున్నూ మన మనస్సులో నెటుల గోచరించునో ఆటువలెనే యాపరశివుని గురించి యేర్పరచబడిన మంత్రమును మననము జేయునపుడా పరశివుని ధ్యానమే మన మనస్సులలో గోచరించుచు నిటుల తరుచు జేయుచుండిన యెడల యూఢియగును. మన మనస్సులలో పరశివస్వరూపము లీనమగును. ఇది ప్రాణలింగ సావధానమై యున్నది. మరియు సూక్ష్మశరీరమునందు మనసు చేత నడుపబడు సంకల్పవికల్పముల మధ్య తానుండియును అధోముఖముగా నుండుట వలన తెలుసుకొన లేకుండా నుండును. గనుక నూర్ధ్వముఖమై అచట నుండు వస్తువు పరశివాభిన్నమగు తానేయని గ్రహించవలెను. ఈ సూక్ష్మశరీరమున ప్రాణము ఊర్ధ్వముఖమైనందున సూక్ష్మ శరీరాభిమానము నశించి తాను పరశివాభిన్నమని తెలిసి పరశివునియందే లయమై యుండుటవలనప్రాణ లింగమును బొందును.

ఇట్లూర్ధ్వ ముఖముగాగాక నధోముఖముగా సూక్ష్మ శరీరములోనుండు ప్రాణమధోముఖముగానే సూక్ష్మ శరీరసహితముగా పరశివాభిన్నమగు చిచ్ఛక్తియొక్క తమోగుణమునందు యేర్పడిన పంచీకృతస్థూల పంచభూతములచేత జేయబడిన స్థూలదేహమునందు జేరును. స్థూలశరీరసంపర్కమున ప్రాణము జీవమను నామమునుబొంది పరశివయుక్తమై యుండుటచేత జీవచైతన్యమగునుఅనగాజీవుడగును ఈస్థూలదేహమునందుఅంతఃకరణము, మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము, సమానము, వ్యానము, ఉదానము, ప్రాణము, అపానము, శ్రోత్రము త్వక్కు. చక్షువు, జిహ్వాఘ్రాణము, శబ్దము, స్పర్శము, రూపము, రస

ము, గంధము, వాక్కు—పాణి పాదగుహ్య గుదములను పనిముట్లు వుం
డును. ఇట్టిశరీరమందు నివసించిన జీవుడుమనను సహితముగా స్థూలశరీ
రమందలినమస్తేంద్రియవ్యాపారమునజుపుచు నచటియింద్రియములలో
ముఖ్యమైన నేత్రేంద్రియముతో తరుచు తనశరీరమునకు బయటనుండు
బాహ్యప్రపంచమును జూచుచుండును. అపుడు తానధోముఖముగా
నుండుట వలన పరశివాభిన్నమగు చిచ్ఛక్తి యొక్క అంశమే తానుగా
వచ్చియీశరీరములలో పరశివ యుక్తముగానున్నాను అనుమాటమరచి
జీవుడను సంజ్ఞనుకలిగి యీస్థూలశరీర వ్యాపారములన్నియు తానే జేయు
చున్నాననుకొనుచుండును తనసంగతి తాను తెలిసికొని లేకుండుట సరే
కదా స్థూలప్రపంచమనగా నెద్దియో దానియందు ప్రకాశించు వస్తు
వెద్దియో తెలుసుకొనలేకుండా నుండును. స్థూల శరీర వ్యాపారములవ
ల్లకష్టములు కలుగునపుడు దుఃఖించుచు నవియెట్లుపోవునా యని యా
లోచించు చుండును. బ్రహ్మవిద్యాభ్యాసమువల్ల నూర్ధ్వముఖమగు
నెడల స్థూలశరీరవ్యాపారము తాను చేయుచున్నా ననెడియూహ తగ్గిప
రశివాభిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశమే తానుగావచ్చి యీశరీర
మున పరశివయుక్తముగా యుండి వ్యవహరించుచున్నట్టు లూహించి
యీ వ్యాపారఫలిత మంతయు పరశివ చైతన్యమునదే యనియూహిం
చుచు ఆనందించును. గనుక బ్రహ్మవిద్య యనగానేమియో తెలుసుకో
వలసియున్నది. బ్రహ్మవిద్యయనగా బ్రహ్మము స్థూలదేహము, స్థూల
ప్రపంచములను నవియెవ్వియో తెలుపువిద్యయైయున్నది. బ్రహ్మవిద్యా
భ్యాసమునకై మొదట గొన్ని విషయములను తెలుసుకొని నట్టులయి
తే అందువల్ల మనసునకు నిశ్చలనత్వముగలిగి క్రిమముగా బ్రహ్మవిద్య
యలవడునుగనుక వినుము పాలలో వెన్నయున్నట్లున్నూ కాష్ఠమందగ్ని
యున్నట్లున్నూ తిలలలో తైలమున్నట్లున్నూ పరశివస్వరూపముస్థావర
ములలో గూఢముగను చరజంతువులలో బాహాటముగను వ్యాపించి
యున్నది. పరశివ స్వరూపము నిరాకారముగదా అట్టిదానిలో ఆకార
ముతో గూడినజగత్తు యెట్లుగలిగినదని సంశయింపకుము,

నిరాకారమగు నాకాశమున నిందధ్రనసున్నా నక్షత్రములు మొదలగునవియున్నా యెటుల గోచరించుచున్నవో యట్టివిధమున నిరాకారమగుపరబ్రహ్మమునందు వేరుగాలేనిచిచ్ఛక్తియేయాకారముగ జగత్తుగా పరిణమించినదని తెలియుము. అట్లుతనయందు పుట్టిన జగత్ప్రపంచ తిరిగి తానగు పరశివు డెటుల లీనమయి యున్నాడని యెంచ కుము. మట్టివలన నిర్మింపబడిన కుండ మట్టికి వేరుగానట్లూహించుము. మరియునాకాశమునందు క్రమముగా సృష్టియైన పంచ భూతములలోనిదగు మట్టివలన పుట్టిన కుండలో నాకాశము యెట్లున్నదో యటువలెనేపర శివుడు తనయందు పుట్టిన జగత్తులో తానున్నాడని యెంచుము మరియు నెదుట కనపడు దృశ్యప్రపంచము వేరు చూచు నట్టి తానున్నా తన శరీరమున్నా వేరని తోచుచుండును. అట్టి సందేహము కూడా నివృత్తియై సర్వము నొకటే యనియును, సర్వము నందును పరశివ స్వరూపము నిండియున్నదనియు నిశ్చయము కలుగు మార్గమును బోధించెద వినుము. ముందుగా నూర్ధ్వముఖమును గలిగి అనగా పరశివ తత్త్వమును దెలుసుకొనవలయుననెడి తలంపు గలిగిన వాడై తన యొక్క స్థూలశరీరమున్నూ తనచే జూడబడు స్థూలప్రపంచమున్నూ కూడ దృశ్య పదార్థములేయని మొదట నూహించవలయును. రెండునుదృశ్యపదార్థములే యగుటవలన తన శరీరము వేరు ప్రపంచము వేరు అని యెంచక వాటిని యేకము జేయవలయును. పెద్దవిగానుండు స్థూల ప్రపంచమున్నూ తన స్థూలశరీరమున్నూ రెండింటిని యొక్కమారే యేకముగా జేయుటకు సాధ్యము కాదు. గనుక నిందుకుపాయము జెప్పెద వినుము. ఒకడు భోజనము చేయుటకు వడ్డింపబడిన పదార్థమంతయు నొక్కమారుగానే కలుపుటకున్నా భుజించుటకున్నా సాధ్యము గాక దానిలో కొంత కొంత భాగము కలుపుకొనియొక్కొక్క కబళమును భక్షించును. కూరలో కొంతభాగమును అన్నములో కొంత భాగమును కలిపి యేకముచేసి అందులో కొంత భాగమగు నొక్కముద్దను భక్షించి దానిలోపలి రుచిని గ్రహిం

చును. మరియు అన్నమును వండునపుడు దాని పాకమును దెలిసి కొనుటకుగాను అంతయును బట్టి జూచుటకు సాధ్యముగాక నొక్క మెతుకును మాత్రమే బట్టిచూచి యాయన్నమంతటి పాకమును గ్రహించును అటులనే దృశ్యమగు స్థూలప్రపంచములోని శిలలు మొదలగు వాటిలో దేనియందైనను కొంత చిన్న భాగమును దీసి దానిని స్థూలప్రపంచమంతయును దెల్పునట్టి సూచనయగులింగముగా నిర్మించి దృశ్యమగు తన స్థూలశరీరములోని కొంతచిన్నభాగమగు అరచేయిని తనస్థూలశరీర మంతటిని దెల్పునట్టి సూచనయగు పీఠముగా నిర్మించి స్థూలప్రపంచసూచనయగు లింగమును తనస్థూలశరీర సూచనయగు కరపీఠమందు ప్రతిష్ఠించి స్థూలప్రపంచ స్థూలదేహములను యేకముగా జేసినటుల భావించి యటులనేకము జేసిన రెండింటి సమ్మేళనమునకు నిష్టలింగమని పేరుంచి యాయిష్టలింగమునందు కాష్ఠమందగ్ని యున్నట్లు పాలలో వెన్న యున్నట్లు తనస్థూలశరీమందు తానున్నట్లు పరశివస్వరూపము నిరాకారముగా లీనమై యున్నదని దలంచుచు దృశ్యమగు మెతుకును సాధనమగు కంటితో చూచి చేతితో బట్టి దాని లోపల నిరాకారముగానుండు పాకమును గ్రహించినట్లు దృశ్యమగు తన చేతినిన్ని ప్రపంచమునున్ను యేకము జేసి యేర్పరచిన దృశ్య పదార్థమగు నిష్టలింగమునందు సాధనమగు నేత్రముతో జూచి తెలివిచే నందులోపలనుండు నిరాకారమగు పరశివ స్వరూపమును గ్రహించవలెను. ఈ ప్రకారము జేయుట మూలముగా గ్రహించవలెను. ఇది యిష్టలింగ సావధానము. ఇటుల చూడబడు పదార్థము నందుతనకిష్టమగు పరశివస్వరూపము లీనమైయుండుటవల్ల నిష్టలింగమని పేరు. సూక్ష్మ గలుగుటకుగాను సురల క్లుప్తముగా జెప్పెదవినుము. బ్రహ్మాండమంతలో నిండియున్న పరశివస్వరూపమున కభిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశమే కలరూపమున పరశివుని కూడియుండి యీ దేహమాదు బ్రహ్మరంధ్రముగుండా ప్రవేశించి సహస్రారచక్రమునసుండిప్రమ్మటమనసుతో కూడి అటుతరువాత నేత్రమునందు జేరి ఆ ద్వారా దృష్టితో గలిసి శరీర బాహ్య

ప్రదేశమునకువచ్చి బాహ్యప్రపంచమందంతట లీనమైయుండు తనని జరూపమగు చిచ్ఛక్తియుక్త పరశివతత్వముతో కలియుచూ ఆనం దించుచుండును. ఇదియిష్టలింగ సావధానము. మరియు నింకొకసారిజె ప్పెదవినుము. ఈ యిష్టప్రాణభావలింగములలో మణిగణసూత్రవత్ సర్వవ్యాపకమయియుండు మహాలింగమునకే త్రివృత్సూత్రమని పేరు.

పరశివున కభిన్నమయిన చిచ్ఛక్తియొక్క అంశము పరశివరూప మగు సూత్రమందు అధోముఖమై ఆ శివసూత్రమునందే ప్రాజ్ఞుడు అను పేరున అవిద్య యను కారణదేహమునం దభిమానము గలిగి యుండి చిద్బిందువుగానుండి యా సూత్రమునందే బ్రహ్మ విద్యా ప్రాబల్యమున నూర్ధ్వముఖమై యోగాంగమను పేరును బడసి యా కారణదేహము నందభిమానము విడచి తాను పరమాత్మతో కూడియే యున్నానని తలచుచు తన నిజరూపమునుగల పరశివ తత్వమగు లింగ మందు లయమును బొందును. ఇది భావలింగ సూత్రము. పరశివున కభిన్నమయిన చిచ్ఛక్తియొక్క యంశము పరశివరూపమను సూత్ర మున నధోముఖమై యాశివసూత్రమునందే తైజసుడు అను పేరున సూక్ష్మశరీరమందు అభిమానముగల ప్రాణమైయుండి బ్రహ్మవిద్యా ప్రాబల్యమున నా సూత్రమునందే యూర్ధ్వముఖమయి యా సూక్ష్మ శరీరమునందభిమానము విడచి భోగాంగమను పేరును బడసి తానంతర మందాత్మతో కూడియే యున్నానని తలచుచు తన నిజరూపముగల పరశివ తత్వమగు లింగమందు లయమును బొందును. ఇది ప్రాణ లింగ సూత్రము. పరశివున కభిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశము పరశివరూపమగు సూత్రమందుఅధోముఖమయిఆ పరశివసూత్రమునందే విశ్వుడు అను పేరుతో స్థూలదేహమునం దభిమానముగల జీవుడై యుండి బ్రహ్మవిద్యా ప్రాబల్యమున నా సూత్రమునందే నూర్ధ్వ ముఖమయి యా స్థూల దేహమునం దభిమానము విడిచి త్యాగాంగ మని పేరును బడసి తాను జీవమందాత్మతో కూడియే యున్నానని దలచుచు తన నిజరూపముగల పరశివ తత్వమగు లింగమందు లయ

మును బొందును. ఇది యిష్టలింగసూత్రము. ఈ యిష్టప్రాణభావ లింగ రూపములుగానుండు సూత్రమునకు త్రివృత్సూత్రమనియు, యజ్ఞోపవీతమనియు యజ్ఞోవై విష్ణు రిత్యాది శ్రుతిప్రమాణముల ననుసరించి యజ్ఞస్య విష్ణునామ్నః పీఠస్య ఉప, సామీప్యేన, వి, విశేషేణ ఇతం ఆవృతం యజ్ఞోపవీతం శివలింగ మిత్యర్థః అని యుత్పత్త్యర్థముగనుక లింగమనియు పరమమనియు పవిత్రమనియు పేరు. మరల నింకొకసారి చెప్పెద వినుము. ఇట్లు సర్వత్ర వ్యాపించియుండు మహాలింగమే పరశివాభిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశము పరశివ యుక్తమగు కలారూపమున శరీరమందు బ్రహ్మరంధ్రముగుండా ప్రవేశించి సహస్రారమున నుండినపుడు భావమునకు గోచరమగుచు భావలింగమైయుండి ప్రాణవాయువుతోచేరి హంస స్వరూపమున శరీరాంతరమందు సంచరించునపుడు మనసునకు గోచరించుచు ప్రాణలింగమైయుండి నేత్రమునుండి బయలు నెడలు దృష్టితో గలిసిబాహ్యప్రపంచమునందు దృశ్యపదార్థములను జూచునపుడు దృష్టికిగోచరమగుచు యిష్టలింగమై యుండును. ఎందువల్లననగా తన కిష్టమయినటువంటి పరశివస్వరూపము తనయిష్టమునందు అనగా దృష్టితో జూడబడుపదార్థముల యందు లీనమైయుండుట వలన యిష్టలింగమని పేరు. అట్టిలింగము తన నేత్రదృష్టితో చూచునపుడు గుర్తింపబడినది గనుక దృష్టిగోచరమగు యిష్టలింగము అని చెప్పబడినది ఇట్లుభావప్రాణేష్టలింగములుగా ప్రకాశించునది పరశివ పరబ్రహ్మస్వరూపమగు లింగమే కాని వేరు కాదని చెప్పుచూ గురుడు శిష్యుని కారణ శరీరమనబడు అవిద్యనుఅనగా అజ్ఞానమును వేదదీక్షవల్ల బోగొట్టి యా కారణశరీరమునందభిమానమును నశింపజేసి యోగాంగముగా జేసిఅనగా యోగముచేతబ్రహ్మమగు లింగమందు లీనమైయుండెడి యభ్యాసమును జేసుకొనుటకై భావరూపమగు భావలింగము నచట బ్రతిష్ఠించి సూక్ష్మశరీరభ్రాంతిని విడిచిమనసుచేత తాననుభవించు భోగములన్నియు పరశివునిభోగము లేయను రూఢిని గలిగియుండునట్లు చేయుటకై ప్రణవపంచాక్షరీ

మంత్రోపదేశము చేసి పరశివుడు అక్షరుడు హంస స్వరూపుడునునై సూక్ష్మ భోగములు అనగా సూక్ష్మశరీరేంద్రియముల వలన గలిగెడు భోగము లనుభవించుటకై సూక్ష్మశరీరమందు ప్రాణవాయువుతో గలిసి చరించుచూ నాసూక్ష్మశరీరేంద్రియముల వలన గలిగెడు సుఖములనన్నిటిని అనుభవించు చున్నాడు.గాన నవి యతని భోగములే యని చెప్పి సూక్ష్మశరీరము పరశివునిదే యని దలంచక నందుకు వ్యతిరేకముగా తానెవరో యొకరున్నట్టున్నా అట్టితనదే యాసూక్ష్మశరీరమనియు దలంచుచుండెడి భ్రాంతిని మనోదీక్షవల్ల బోగొట్టియాసూక్ష్మదేహము నందభిమానమును బోగొట్టి భోగాంగముగా జేసిఅనగా మంత్రమును మననము జేయుట మూలముగా పరశివ స్వరూపమును జ్ఞప్తికి దెచ్చుకుని ప్రాణమనబడు తానుపొందెడు భోగములన్నియు లింగభోగములే యనిలింగమందు లీనము జేయునట్టి విధమునభ్యాసము జేసుకొనుటకై మంత్రరూపమగు ప్రాణలింగము నచటబ్రతిష్ఠించి జడమైదృశ్యములగు బాహ్యేంద్రియము లన్నియు జేయువ్యాపారమునంతయు పరశివాభిన్నమగు చిచ్ఛక్త్యంశము పరశివయుక్తముగా స్థూల దేహమునందు అధోముఖముగా నుండుట వలన జీవుడను పేరుగలిగి వ్యవహరించు చున్నది కానిస్థూలదేహము చేయుటలేదని నిశ్చయించిస్థూలదేహము చేయుచున్నదని దలంచును ద్వైతము నత్యజింపజేయుట మూలముగా క్రియాదీక్షచేత స్థూలశరీరమునందభిమానమునుబోగొట్టి త్యాగాంగముగా జేసితనకిష్టమగు సర్వాంతర్యామియగు పరశివుని స్వరూపముదృశ్యములగు స్థూలశరీర స్థూలజగత్తులందులీనమై యున్నదను విషయము రూఢినిబొందుటకై యభ్యాసము చేసుకొనుటకు యిష్టలింగమునచట బ్రతిష్ఠించి యాభావప్రాణేష్ట లింగముల స్వరూపములను తిర్గి తత్వమసియను సామవేద వాక్యార్థమూలముగా నుపదేశించి యాచిత్కళను మనోనేత్ర గోచర మగునటుల బ్రత్యక్ష క్రియచే తెలియ జేయును.

## గురులింగము.

పైన వ్రాయబడిన ప్రకారము తన జ్ఞానానుభవమువల్ల భావలింగముగాను మనోగోచరమందు ప్రాణలింగముగాను దృష్టి గోచరమందు యిష్ట లింగము గాను పరశివ స్వరూపము భావమనో దృష్టుల యందు లీనమై యుండుట వల్ల లింగము యున్నదని గురువుచేత దెలుపబడినది. గనుక గురులింగ మనిపేరు. ఈ గురులింగము జలము సర్వప్రాణులను చల్లబరచిన విధమున గురూపదేశమున బోధింపబడి యా బోధను బడసిన వారి హృదయతాపమును చల్లబరచును గాన గురులింగము జలతత్వమును బోలియున్నది. ఇట్టి విధమున గురుని దయవల్ల గుర్తించ బడినది గనుక గురులింగము యున్నది.

## జ్ఞానశక్తి.

పరశివాభిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశము పరశివునికూడి యుండియే యీ దేహంబున నధోముఖమయి యుండుట వలన పరశివ సంపర్కసామర్థ్యమునుమరచి జీవుడను పేరు గలిగి సమస్తమైన క్రియలను యేయే విధముగా జేయవలయునో తనలో తాను తన తెల్విలో నిశ్చయించునట్టి శక్తికి జ్ఞానశక్తియని పేరు.

## నైష్ఠికభక్తి.

జీవుడు బ్రహ్మవిద్యవల్ల నూర్ధ్వముఖమును గలిగి అంగమను పేరును గలిగి పరశివాభిన్నమగు చిచ్ఛక్తియొక్క అంశమే పరశివుని కూడియుండియే తానుగా యీ దేహములో నున్నట్టు తెలిసికొని యున్నందున సమస్తమయిన క్రియలను జేయుటకు తనకు గలిగిన జ్ఞానము పరశివసంపర్క సామర్థ్యముననే కలిగినటుల నెంచి గురువువల్ల తన కభిన్నమగు పరశివ స్వరూపముగా దెలుసుకొనబడిన గురులింగమునందు ప్రేమ హెచ్చి యా లింగ నిరీక్షణయందు నిష్ఠను గలిగి యుండు స్థితికి నైష్ఠికభక్తి యని పేరు.

## మహేశ్వరస్థలము.

గురులింగమును దెలుసుకొనునపుడు గురువువల్ల తాను తత్త్వమసియను వాక్యార్థమును బోధింప బడినవాడై ఓం నమశివాయ యను షడక్షరీ మంత్రస్వరూపుడును విశ్వాతీతుడును నగు మహద్వస్తుస్వరూపుడగు మహేశ్వరుని యంశమే తానని దెలుసుకున్న వాడగుట వల్ల నా విషయము సూక్షిగలుగుటకై శివపురాణాదుల కాలక్షేపము జేయుచు మధుమాంస భక్షణము, పరస్త్రీవాంఛ, పరధనాపహరణము మొదలగునవి లేని మహనీయులగు భక్తమహేశ్వరుల నారాధించుచు నిష్టప్రాణభావలింగముల నర్చించునట్టి స్థితియే మహేశ్వరస్థలము.

## శివలింగము.

అంగమను పవిత్రనామమును బడసిన జీవుడు తాను గురునివల్ల పొందబడిన గురులింగమును గురించి మహేశ్వరస్థలమున పురాణాదులచే పరిశీలించగా నా గురులింగము జన్మరాహిత్యమును శుభమును గలిగించు పరశివుడగు శివస్వరూపమనియే తేలినది గనుక నా గురులింగమునకే శివలింగమని పేరు. అగ్ని తనలో జేర్చిన పదార్థములను తన రూపముగా నెటుల జేయునో అటువలెనే శివుడు తనయందు దృష్టిని మనసును భావమును జేర్చుటమూలముగా జేరినవారిని తన స్వరూపముగా జేయునుగనుక శివలింగము అగ్ని తత్త్వముతో బోల్చడ మయినది- శివస్వరూపముగా గుర్తించబడినది గనుక శివలింగమని పేరు.

## ఇచ్ఛాశక్తి

జీవుడధోముఖముగా నుండుట వలన తాను పరశివాభిన్నుడనని తెలియక తానెవరో యొకరు స్వతంత్రముగా యున్నట్లూహించుచూ తాను యేవో కొన్ని ప్రపంచ సంబంధమైన పనుల చేయవలయునను యిచ్ఛను గలిగియుండు స్థితికి యిచ్ఛాశక్తియని పేరు.

## అవధానభక్తి.

జీవుడు బ్రహ్మవిద్యాబలమున నూర్ధ్వముఖముగలవాడై అంగమను పవిత్ర నామమును బడసి తాను పరశివాభిన్నుడ నని యెరిగినందు

న తనకు గలిగిన యిచ్ఛ తనదిగా నెంచక పరశివునిదే యని యవధానముచేయు స్థితికిఅవధానభక్తియనిపేరు.

ప్రసాద స్థలము.

తత్వమసి యను వాక్యార్థవిచారణ వల్లనున్నూ లింగాంగ సమరసజ్ఞానము వలననూ జీవుడు తాను పరశివాభిన్నుడనని తెలుసుకొని యున్నందున అంగము పవిత్రనామమును బడసి యున్నాడు. యిదిస్థిరపడుటకు గాను యిదిపరకు తెలుసుకొన్ని యున్న శివలింగమందుఅవధాన భక్తిని గలిగియుండవలయును. ఎట్లనగా తాను యేపనిచేయుచున్నను అది పరశివుని పనియే యనియు శివునకు మినహాయితర వస్తువుగా తానొకడ నున్నానని యెంచక తన దేహము మనసు ఇంద్రియములు మొదలగున వన్నియు శివునివేయని యూహించు చుండవలెను సంకల్పించుట, నిశ్చయించుట, చూచుట, రుచి చూచుట, తినుట, నడచుట, కూర్చుండుట, పరుండుట, లేచుట, యిచ్చుట, పుచ్చుకొనుట మొదలుగాగల సర్వేంద్రియ వ్యాపారములున్నూ శివుని వ్యాపారములే యని అవధానము అనగా నిశ్చయమును గలిగి యుండవలెను. ఇట్లు ప్రతి విషయమునందును శివుని జ్ఞప్తియందుంచుకొనుట మూలముగా శివుని ప్రసన్నతను బొందిన స్థితియే ప్రసాదస్థలము.

ఇట్లు అవధానము చేయుచు అనుభవమునుపొందవలసియున్నది. ఒకడొక పదార్థమును విడుచునపుడది మీది భాగమునకు వెళ్ళక దిగువకు తేలికగా పడును. అటువలెనే జీవుడు తాను యేపనిచేయుచున్నను నూర్ధ్వముఖవ్యాప్తిచే శివునిచే చేయబడుచున్నదని తోచక అధోముఖ వ్యాప్తుండగు తాను చేయుచున్నటుల దోచును.

మరియు ప్రతివాని మనస్సున్నూ కంటికి నగుపడక నిరాకారముగా నున్న పదార్థముమీదనున్నూ దూరముగా నుండుపదార్థముమీదనున్నూ ప్రవేశించక యెదుట కనబడు పదార్థము మీదకు సులభముగా బ్రవేశించును. ఇది సహజము గనుక అటులనే నిరాకారముగా నుండు పరశివుని చూచుటకు సులభముగా చేరదు. ప్రతిపదా

ర్థము నందున్నా శివస్వరూపమువ్యాపించియున్నదిగనుక పాలకొరకు రాళ్లను మోసినట్లు నిరాకారమగు పరశివ చైతన్యమును తనలో గూఢముగా కలిగియున్న యెదుటను కనుపించు వస్తువుల లోనిదగు శిలారూపమగు లింగమును గాని సువర్ణరూపమగు లింగమునుగాని చేతిలో నుంచుకొని కంటికి నగుపడువస్తువును జూచినపుడెల్ల అందులో పరశివ స్వరూపము వ్యాపించియే యున్నదని జ్ఞాపకము చేయుటకై సూచనగా గురువు స్థూలశరీర మందు స్థాపించిన బాపతు ఆ చేతిలో నుంచుకున్న యిష్టలింగమునకు తాను భుజించుట మొదలగు సత్క్రియలను జేయునపుడు పైయాకారమును గుర్తించక యెందువల్లననగా పైయాకారముమలినయుక్తమగు ప్రపంచములోనిది గనుక దాని నిజ్ఞప్తించక లోపల లీనమైయున్న పరశివస్వరూపమును జ్ఞప్తించుచు అట్టి పరశివ స్వరూపమునుగల యిష్టలింగమునకు జూపి సమర్పించుచూ నాలింగాంతర్వర్తియై నిరాకారుడుగా నున్న పరశివునిచే చేయబడు చున్నదని అవధానము చేయుచు ప్రతివిషయములోను నిర్మలుడగు శివుని తరుచు జ్ఞాపకము చేసుకొను చుండిన యెడల మనస్సు నిర్మలమైశివప్రసన్నతను బడయును. శివునిప్రసన్నతయే శివప్రసాదము. ప్రసన్నత అనగా ప్రసాదమని యర్థము. జీవుడు యేపని మానినను అంతకష్టము లేదు గాని నిద్రాహారములు మానిన యెడల కష్టము వచ్చును. గనుక అవి తప్పవు భుజించు నపుడు భోజనదృష్టిలో లింగదృష్టిని మరచును. అటుల మరువ కుండా నిద్రాహారములు కూడా శివునివేయని యవధానములో శివుని జ్ఞప్తియందుంచు కున్నయెడల శివుడు మినహా తానొకడ నున్నాడని తోచక శివుని ప్రసన్నతను బడయును.

శిల లేక సువర్ణాది లింగములకు పైభాగమందు పూజించి యర్పించినయెడల లోపల నిరాకారమునకు యెట్లు జెందునని సందేహపడకూడదు. కుండలో నీరున్నప్పుడు పైభాగమందు కాచినయెడల లోపలనుండు నీరు వేడి యగునట్లు లింగమునకు పైభాగమునందు చేయు పూజాదులు లోపలనుండు నిరాకారమగు శివునకు చేరును

భోజనము జేయునపుడు అన్నమును గలిపి ముద్దచేసి కుడిచేతితో వామ హస్తమందున్న లింగమునకు జూపుచునీయన్నమును, హాహస్తమును నావామ హస్తమందున్న లింగమునుకూడా దృశ్యపదార్థములే యని దలచి యాదృశ్యపదార్థము లన్నియు నేకముగా భావించి యటుల నేకముచేయబడిన దృశ్యపదార్థమందు పరశివుడు నిరాకారుడై లీనమైయున్నాడు సుమా యనిదలచి యెటువలెననగా నీయన్నపు ముద్దయందు రుచి యేవిధముగ లీనమైయుండి కంటికి గోచరించక తినునపుడు అనుభవమువల్ల తెలియబడు చున్నదో అట్లు పరశివుడు దృశ్యపదార్థ రూపముగానున్న యీ చేతిలో నుండు లింగమందు లీనమై యున్నాడని అనుకొనుట మూలముగా శివప్రసన్నతను బొంద వలయును. అన్నమును దినునపు డటుల చేసినయెడల క్రమేణ రూఢియై శివప్రసన్నత గలుగును. అన్నమువలన నీ విధముగా శివప్రసన్నతను బడయుట వలన నట్టి శివ ప్రసన్నతను గలుగజేసిన అన్నమునకు ప్రసాదమని పేరువచ్చినది. ఇట్లు పలువిధముల. శివుని ప్రసన్నతనుపొందినస్థితిని ప్రసాదస్థలము. ఈవిధముగానవధానముజేయుచుండినయెడల దృశ్యమగు, తనశరీరమందును బాహ్యప్రపంచమునందు సర్వవస్తువులందును పరశివుడు లీనమయి యున్నాడను. రూఢి గలుగు చుండును.

## చరలింగము.

ప్రసాదస్థలమునందు శివలింగరూపముగా గుర్తించబడిన వస్తువు పరశివ స్వరూపమనియే తేలినది. ఆ పరశివున కభిన్నమగు జ్ఞానస్వరూపమగు చిచ్ఛక్తియొక్క చలనమే ప్రాణశక్తి యను ప్రాణవాయువు. ఆ చిచ్ఛక్తిలోని యణువులో 12 వ్వర భాగము పరశివుని కూడి యుండియే అధోముఖముగా నుండుటవలన జీవుడై దేహములో సహస్రార చక్రమున జేరియుండి ఆజ్ఞావిశుద్ధ అనాహత మణిపూరక స్వాధిష్ఠాన ఆధార చక్రములవరకు దిగువ భాగమునకునూ, అక్కడనుంచి సహస్రారము వరకు క్రమముగా నెగువ భాగమునకునూ ప్రాణా

పానములమధ్య తాను కార్యస్థానము నేర్పరచుకొని తన శక్తిచేత శరీర మునకు బయటనుండు వాయువు నాకర్షణమును జేయుచు నాసాపుట ములనుండి ఉచ్ఛ్వాస నిశ్వాసములుగా రోజు 1 కి రాత్రింబగళ్ళు 21600 పరియాయములు నడపుచూ ఆ శ్వాసములలో తాను హంస రూపమున సంచరింపుచూ నుండును. అటుల చలించు వస్తువునకు లయస్థానమగుటయేగాక అట్లు చరించు వస్తువునందు పరశివుడు లీనమై యున్నాడు గనుక నిట్లు గుర్తించబడిన పరశివునకు చరలింగమని పేరు. వాయువునకు చలన మెటుల స్వభావమో అటులనే యీ చరలింగము చలించుచుండును. గనుక వాయుతత్వముతో పోల్చబడమైనది. అచలు లగు పరశివుడెటుల చరించునని సందేహించ తగదు. నడచునట్టి పడ వలో కదలకుండా కూర్చుని ప్రయాణము చేయువాడు తానుకదలకపోయి ననూ చరించినవానివలె యెటులప్రయాణము చేసినవాడగుచున్నాడో అటువలెనే చరలింగముయొక్క రీతిని గ్రహించవలెను. సహస్రార చక్ర మునుండి తన స్వశక్తి యగు ప్రాణవాయువుతో గూడి విద్యుల్లేఖ అనగా మెఱపు తీగవలె జ్యోతిరూపముగా ఆధారచక్రమువరకు సూత్ర మువలె యేకముగా వెలుగుచూ ఆధారస్వాధిష్ఠాన చక్రములకు నడుమ ననగా ప్రాణాపానములకు మధ్య శ్వాసముల నడుపునట్టి కార్యస్థా నము నేర్పరచి శ్వాసలు నడుపుచూ అట్లు నడుపునపుడు యెచట కొంత సుఖముగ నున్నట్లు కనబడుచున్నదో అట్టి హృదయస్థానమును అనుభవశాలగా జేసుకొని సహస్రారమున విశ్రాంతిని బొందుచు నిటుల నెల్లకాలము చరించు చుండును. మరియు చలనమే స్వభావము గాగల వాయువుయొక్క అంశమున గలిగిన మనసుతోగూడి చరించు చుండు వస్తువునకు లయస్థానమగుటయేగాక దానిలో లీనమై యుండు టవలన కూడా చరలింగమని పేరు. మరియు నాసాపుటములనుండి నడపుచుండు బాహ్యములగు శ్వాసలు 21600 గాక 3400 లు సూక్ష్మ రూపములగు శ్వాసలను తన స్వశక్తియగు ప్రాణములో నిమిడియుం డు శుద్ధవాయువుతో సహస్రార చక్రమునకు పైభాగమున నుండు

శిఖాపశ్చిమమున శ్యామసుందరి యొక్కలో అంతరమందు నడుపుకొనుచుండును ఇట్లు స్థూలశరీరములో బాహ్యములగు వాయురూప శ్వాసములతో నున్నా సూక్ష్మశరీరమందు మనోరూపములగు శ్వాసములతో నున్నా కారణ శరీరమందు జ్ఞానరూపమగు శ్వాసములతో నున్నా ఒకడు నడచునట్టి పడవలో కదలకుండా కూర్చుని ప్రయాణము చేయువానివలె ఆత్మ చరించుచుండుటవలన కూడచరలింగమని పేరు. ఇట్టివిధముగా నడచు శ్వాసములతో దీపపు ప్రకాశము దీపమున కభిన్నమగునట్లు పరశివాభిన్నుడగు జీవుడు చరించుచున్ననూ తా నధోముఖముగా నుండుటవల్ల నవి నడచు విధమును తాను చరించు విధమును తెలియకుండును. ప్రతి జీవియు తన యవయవములతో చేయు పనులవల్ల తాను సుఖము బొందుచుండును. అటులనే జీవుడు శ్వాసములవల్ల కొంత సుఖమును బొందును. అది యేమనగా శ్వాసలు సరిగా నడువనపు డుక్కిరి బిక్కిరిగానుండి యేమియుతోచదు. అడునపుడు హాయిగానుండును. ఇదియే శ్వాసమువల్ల బొందు ప్రత్యక్ష సుఖము. ఇది జీవానందము. ఈ శ్వాసములు యెటులనడచుచున్నవియువానితో తాను యెటుల చరించుచున్నదియు తెలిసిన సుఖము లింగానందము.

## ఆ ది శ క్తి

జీవుడధోముఖముయి యుండుటవల్ల పరశివుడొకడున్నాడనియు తానా పరశివున కభిన్నుడ ననియు ననుభవమే తెలియక పరశివునకు భిన్నముగా తానొకడున్నట్లు దలచుచు పైనివ్రాయబడినమూడు విధములయిన్న శ్వాసలు మొదలగుజీవ చైతన్య వ్యాపారమంతేయు యెటులచేయుచున్నది తనకు అనుభవమువల్ల తెలియకపోయిననూ ఆ వ్యాపార మంతయును శరీరమందన్ని భాగములకు వ్యాపింపజేయుటకు మొదలుపెట్టిన తనశక్తికి ఆదిశక్తియని పేరు.

## అ ను భ వ భ క్తి.

జీవుడూర్ధ్వముఖమును గలిగినవాడై యంగమను పవిత్రనామమును బడసి తాను పరశివాభిన్నుడ నని యెరిగి యున్నందున

శ్వాసములనడపుట మొదలగు జీవచైతన్యవ్యాపారమంతయు పరశివునిదే యని నిశ్చయించి బ్రహ్మవిద్యాబలమున నీ దిగువున వివరించిన ప్రకార మభ్యసించుట వలన గలిగిన యనుభవముతో కూడినదే యనుభవ భక్తియయియున్నది.

## ప్రాణలింగస్థలము.

అంగమను పేరు గలిగిన జీవుడు తాను పరశివాభిన్నుడ నని యెరిగిన అనుభవము రూఢిగలుగుటకై పైనిదెలుపబడినచరలింగమగు పరశివ రూపము నీ విధమునగమనించవలెను. పాలును నీళ్ళనుగలిపి యుంచినపుడు వానిలో నివి పాలు నివి నీళ్ళు అని తెలుసుకొను జ్ఞానము హంసకు కలదు. అటువలెనే పరశివుని కభిన్నముగా నుండుచిచ్ఛక్తికట్టిమహాజ్ఞానము కలదు. అట్టిపరశివున కభిన్నమగుచిచ్ఛక్తియొక్క అంశము పరశివునకూడి యుండియే ప్రాణవాయువుతో కలిసి దేహమున నుచ్ఛ్వాస నిశ్వాసములుగా సంచరించు చున్నందున పరశివాభిన్న జీవమునకు హంసయనుపేరు వచ్చినది హంసయనురెంతక్షరములలో హకారము శివబీజము, సకారము శక్తిబీజమును వాని మధ్యనుండు నున్న శివశక్తుల కైక్యమును దెల్పు సూచనయునై యున్నది. గనుక ప్రతియుచ్ఛ్వాస నిశ్వాసములందును ఆపరశివున కభిన్నమగు చిచ్ఛక్త్యంశమగు తాను పరశివునికూడియుండియే సంచరించుచూ నేనుగా నున్నాను గనుక ఆపరశివుడే నేననుసోహంభావముతో ప్రతియుచ్ఛ్వాస నిశ్వాసమందును జ్ఞప్తిలో నుంచుకోవలెను. సోహంశబ్దమునందుండు తచ్ఛబ్దము పరశివునకున్నూ అహంశబ్దము ప్రాణవాయు సహితచిచ్ఛక్త్యంశము నందు లీనమయియున్న పరశివునకున్నూ, బోధకములై యున్నవి గనుక జీవుడు తాను పరశివాభిన్నుడుగ నున్నటులదలచుచు శ్వాసములు నడచునపుడు ప్రతిశ్వాసము నందును శివుడేనేను శివుడే నేనుఅని గమనించుచుండవలెను. పరశివరూపమగు చరలింగము ప్రాణమందు లీనమైయున్నది. గనుక ప్రాణలింగమని పేరు.

ఇట్లు బాహ్యమున గోచరించు శ్వాసములులోనున్నూ అంతరమందు మనసులోనున్ను సహస్రారమునకు పైని జ్ఞానవాయువు రూప

శ్వాసములలోనున్నా పరశివరూపము లీనమై చరించుచున్న దనితదేక ధ్యానముతో నుండి తెలుసుకోవలెను. సహస్రారమునకు పైని శిఖా శూన్య పశ్చిమ చక్రములలో నడచు జ్ఞానహంసలు ఇష్ట ప్రాణభావ లింగములలో నెచటనైనను నరే దృష్టినిల్పి అభ్యాసము జేసినయెడల నా హంసల సంచారము తెలియును. అభ్యాసము చేయవలయునుగాని వ్రాయుటకు వీలులేదు. అనుభవగోచరమయి యుండును. బాహ్యము నకు గోచరించు శ్వాసలు నడుచునపుడు వానితో గూడిన ప్రాణ వాయువు సహితముగానున్నా శ్వాసలను బంధించినపుడు తానొక్క ప్రాణవాయువుతోడ గూడినవాడుగానున్నా పరశివాభిన్నుడగు అంగ సంజ్ఞ గల జీవుడగు తాను జ్యోతిరూపమై నొకచే సూత్రముగా మెరు పుతీగవలె సహస్రారము మొదలుకొని యాధార చక్రమువరకు ప్రకా శించు చున్నాననే యనుభవమును గలిగి యున్నస్థితి ప్రాణలింగస్థలము.

## ప్రసాదలింగము.

ఒకడు యేపనియును చేయక నేమియు నాలోచించుచుండక మౌనముగా నుండునపుడు నిరాకారమై అదివరకు తనలోనిమిడియుండు తన తెలివిలో నపుడు యేదియో యొక క్రొత్త యూహ స్ఫురించును. కాని యేవ్యాపారమును కలిగియుండదు. తానున్నట్లు మాత్రము తనలో తనకు గోచరించును ఇట్టి విధమైనశక్తియేపరశివునిలోనుండును దాని పేరు చిచ్ఛక్తి అట్టిచిచ్ఛక్తిలోనియంశమె పరశివుని విడువకయే సహస్రారముననుండునని పైనిదెలుపబడినది. అభిన్నముగా నాచిచ్ఛక్తి పరశివునిలో నూర్ధ్వముఖముగానున్నపుడు ప్రసాదరూపముగా నుండును. ప్రసాదమనగా నిర్మలము జ్ఞానము ప్రకాశము అని యర్థము శరణస్థల మును బొందినట్టి యంగమనెడు జీవుడిట్టివిధముగా నిర్మలజ్ఞాన ప్ర కాశస్వరూపునిగా గుర్తించుట మూలముగా ప్రసన్నతనుబొందిన పరశి వస్వరూపమునకు ప్రసాదలింగమనిపేరు ఈ ప్రసాదలింగము చలించు ప్రాణవాయువుతోకూడియుండుటవలన కూడచరలింగస్వరూపమై యునది. యీ విషయము ప్రాణలింగస్థలమందు వివరించబడినది. యీ ప్రసాద

లింగము గగనమువలె నిర్మలమును వ్యాపక భావమును గలిగి యుండు టవలన ఆకాశతత్త్వముతో బోల్చడ మయినది.

పరాశక్తి

జీవుఁడు పరశివాభిన్నుఁడయ్యును అధోముఖముగా నుండుటవలన పర శివుఁడొకఁడున్నాఁడను సంగతియే తోచక తానుపరశివునకుపరము అనగానిత రుఁడనొకఁడనుస్వతంత్రముగా నున్నాను అని దోపించిన శక్తికి పరాశక్తి యని పేరు.

ఆనందభక్తి.

జీవుఁడూర్ధ్వ ముఖుఁడగుట వలన అంగమను పవిత్రనామము బడసి పరశివుఁడొకఁడున్నాఁడనియు తానుపరశివున కభిన్నుఁడనియు దెలి సిఆనందించు స్థితికి ఆనందభక్తియనిపేరు.

శరణస్థలము

పరశివాభిన్నమగు చిచ్ఛక్తి యొక్క అంశము ప్రాణవాయువు తోఁగూడి పరశివునికూడి యుండియేయధోముఖముగా శరీరమందుప్రవే శించి జీవుఁడై యుండి అధోముఖ సంచారము వలన ననేక కష్టములు బొందుచు బ్రహ్మవిద్యాబలమున నూర్ధ్వముఖమును గలిగి తాను పరశి వాభిన్నుఁడనని దెలుసుకుని యున్నందున ఆనందము గలిగి గొప్పసంఘ మునుండి వీడినవాఁడుమరల సంఘమునందు చేరదలచినటుల తుచ్ఛమగు దేహసంబంధము గలిగియుండుట కిష్టములేక ప్రాణలింగ స్థలమున కలి గినయానందమును స్థిరపరచు కొనుటకు తననిజరూపమగు పరశివతత్త్వ మందు చేరదలచి చక్రవర్తి విలాసార్థముగా సామాన్యులతోఁ గూడి యాడుచుండునటుల తన లీలవలన సంసార పాశములచేతశరీరములనెడు కొయ్యలకు కట్టబడిన జీవులనెడి పశువులుగల జగంబులను సృష్టిస్థితిల యములజేయుచు నాజగంబులోఁగూడి క్రీడించు నట్టియు తననిజస్వరూ పుడగునట్టియు పరశివుని తనను తననిజస్వరూపమగు యా పరశివ తత్త్వమందు జేర్చుమని ప్రార్థించుచు ప్రసాదలింగరూపుఁడగు పరశి వుని శరణుజొను అనగా రక్షణమును గోరినస్థితి శరణస్థలమని పేరు. అన గామరల నధోముఖము గలుగ కుండుటకై ఇటుల జేయును.

ఒకడు శరణుజేయునపుడు తనకభిన్నమగు తనశరీరమందలి యెడమహస్తమును కుడిహస్తమును దగ్గిరకు చేర్చిముకుళించి యెదుటివానికిజూపుచు నాచేతులను యెటులదగ్గిరకు జేర్చినానో అటులనే నేనునీకభిన్నమగు వాడను కనుక నన్ను నీదగ్గిరకు జేర్చుకుని రక్షించమని గోరునుఅటులనే అంగసంజ్ఞగల జీవుడు పరశివునకు శరణుజేయుచు తనరెండుహస్తములు ముకుళించి లింగమగు పరశివునకు జూపుచు దేవా నాకుడిహస్తము వలెనే, నీ కుడిహస్తము వలెనుండు నీకభిన్నమగు నీసమిష్టిస్వరూపమగు నీశ్వర తత్వమందు నాయెడమ హస్తమువలెనే, నీయెడమ హస్తమువలె నుండెడు నీవ్యష్టిరూపమగు జీవచైతన్యమగు నన్ను నా రెండుహస్తములనెటుల నేకము జేసినానోఅటువలెనే, నీరెండుహస్తములనెడి సమిష్టవ్యష్టి రూపములగు, నీనాస్వరూపముల నేకముచేయవలయునని వినయ పూర్వకముగా శరణము గోరినస్థితికి శరణస్థలమని పేరు.

ఇట్లుపరశివునియందే దృష్టినిల్పి యెడతెగని ధ్యానముతోనుండుస్థితిశరణ స్థలము.

మ హా లిం గ ము.

నిరాకారమగు ఆకాశమునందు నిరాకారమగు వాయువుపుట్టి తానుకంటికి కనపడక పోయినను వీచుటవలన నిరాకారమగు పదార్థములందు నింకొక నిరాకారమగు వస్తువున్నట్లుగోచరించు చున్నది అటువలెనేనిరాకారుడగు పరశివునియందు జ్ఞానమే స్వరూపముగాగల చిచ్ఛక్తియూపరశివుని యందభిన్నముగానున్నది జ్ఞానముతానుకనుపడకపోయిననూ ఇది యిట్టి వస్తువు అది యట్టి వస్తువు అని తెలిసికొనుటవల్ల తెలుసుకొనునట్టి వస్తువొకటి యున్నట్లు గోచరించుచున్నది. అన్నిటిని అది తెలుసుకొనుచున్నది. కాని దానిని తెలుసుకొను నట్టి వస్తువు మరియొకటి యున్నట్లు కనుపించదు. ఇట్టిమహత్తరమయిన జ్ఞానము యేపదార్థమునందు లీనమయి యున్నదో అది మహాలింగమయి యున్నది, ఇట్టి మహాలింగ స్వరూపుడగు పరశివునియందే పైనజెప్పబడిన ప్రసాదలింగ-చరలింగ-శివలింగ-గురులింగ ఆచార

లింగములు యేర్పడినవి. ఈ అయిదులింగములు పంచాక్షరములు ప్రణవము మహాలింగము యీమహల్లింగముల వాచ్యము "ఓంనమశివాయ" యను షడక్షరీ మంత్రమైయున్నది. యీమహాలింగము గురు, గొప్పతనము చేతను గురువనియు లింగసమస్తమునందు లీనమయి యుండుటవలన లింగమనియు జంగమ,సర్వప్రాణ స్వరూపముయి చరించుట వలన జంగమ మనియు నిట్లు గురు, లింగ జంగమ స్వరూపమై యున్నది.

చిచ్ఛక్తి.

ఇది జీవుడధోముఖముగా నున్నపుడు పరశివు డొకడున్నాడను సంగతియే తోచక తానే స్వతంత్రుడనని తోపించిన పరాశక్తియొక్క నిజరూపమై యున్నది. ఇదిపరశివుని యందతని కభిన్నముగా నుండు జ్ఞానసముద్రమైయున్నది. అయినప్పటికి నిది యధోముఖముగా నున్నపుడుతన కభిన్నముగానుండు పరశివునిమాత్రము తెలుసుకొనలేదు గాని తనను తాను యెరిగియే స్వతంత్రముగా నుండును. మరియు తన కభిన్నుడగు పరశివుని దెలుసుకొన లేనట్టియు రజ్జువును సర్పముగానున్నా తోపించినట్లుగా నున్నది లేనట్లున్నా లేనిదున్నట్లున్నా తోపించెడివి. చిత్రములగు తన కభిన్నముగా నుండు శక్తులు గల జగత్తులను బుట్టించును. ఇది మలిన సత్వ ప్రధానము.

సమరసభక్తి.

జీవుడూర్ధ్వ ముఖమయినపు డంగమని పేరు గలవాడగును అప్పుడతనికి పరశివు డొకడున్నాడనియు తానా పరశివున కభిన్నుడనియు తోపించిన యూర్ధ్వముఖ చిచ్ఛక్త్యంశమునకు సమరసభక్తి యని పేరు పరశివునిలో చిచ్ఛక్తి యూర్ధ్వముఖ మయియున్నప్పుడు అమలసత్వప్రధానయను పేరునుబొంది ఉన్నది యున్నట్టుల దోచుచు పరశివుడొక డున్నాడనియు తానా పరశివున కభిన్నమనియు దెలిసి యతనిలోచేరి రెండవది లేక యేకమయియుండును. ఇదియమల సత్వ ప్రధానము.

## ఐక్యస్థలము

అంగసంజ్ఞగల జీవుడు భక్తమహేశ్వరప్రసాదప్రాణలింగశరణస్థలములలో జెప్పబడినటులచేయుచు నిష్టప్రాణభావలింగనిరీక్షణముగలిగి నిరాకారముగానున్న పరశివస్వరూపమునందు జ్ఞప్తియుంచవలయును.

మరియుమట్టియందు పుట్టినకుండలు మట్టికి వేరుకానట్లున్నూ నీటిబుగ్గలు నీటికి వేరు కానట్లున్ను పరశివుని తత్వములోనుండి వచ్చిన తాను పరశివాభిన్నమని యెంచుచుండ వలయును. మరియుతాను పరధ్యానములో నున్నప్పుడుతనకంటి కెదుటకొన్ని పదార్థములున్నప్పటికి యెటుల కనపడవో అటులతనయెదుటకనపడు పదార్థములయందులక్ష్యముంచక వాటిలో పరశివ స్వరూపము లీనమై యున్నదను భావముల లక్ష్యముంచిన యెడల పరశివస్వరూపమే గోచరమైయెదుటి వస్తువు కనుపించదు గనుక నిట్లుచేయవలెను మరియుతానే పనిజేయుచున్ననూ పరశివునివల్లనే జేయబడుచున్నదని భావించుచున్న యెడల పరశివభావమేజ్ఞప్తిలో నుండి తాను జేయుచున్నట్లు భావముండదు

మరియు అగ్నియందు ఇనుము జేర్చినయెడల నాయగ్ని యినుపముక్కలోపల వెలుపల వ్యాపించి అగ్నియే కనుపించు చుండును గాని ఇనుపముకనపడదుఅటులసర్వమును పరశివతత్వమందు చేర్చినయెడల పరశివస్వరూపమే కనబడును. మరియునిరాకారమగు నాకాశమునందు గంధర్వ నగరమున్నూ ఇంద్రచాపమున్నూ యేర్పడి మరలనాయాకాశమునందే యెటుల లయమును బొందుచున్నవో అటులనే నిరాకారమగు పరశివతత్వమందు దృశ్యములగు జగత్తులుయేర్పడి మరలనాపరశివునియందేలయమును బొందునని యూహించవలెను.

ఆకాశమునందు దృశ్యమగు నింద్రచాపము పుట్టినటులనే సర్వమును గగనమందే పుట్టుచున్నటుల తలచకూడదు. యెందువల్లననగా ఆకాశముజడమైయున్నది అదియేమియును చేయలేదు లోకమునందు జ్ఞానమునుగల మనుజులు మొదలగువారు జడపదార్థములతో కొన్నిపనులు జేయుచున్నారు. గాని జడపదార్థములు తమ స్వశక్తితో జ్ఞానముగల మనుజులు మొదలగు చరజంతువులను జేయుచున్నటుల

గనుపించదు మరియు నాకాశమున్ను పరశివ స్వరూపమున్ను కూడా నిరాకారము లయి యున్నప్పటికి వాటి మధ్య భేదముకలదు. ఆకాశమునందు జ్ఞానములేదు. పరశివుని యందుఇచ్ఛాజ్ఞానక్రియాత్మకమగు శక్తి కలదు అందువల్ల సాలెపురుగు తనకనన్యముగాని తన శరీరములో నిపదార్థముతో నూలుదీసి గూడునల్లి యా గూటిలో నివసించినటులపరశివుడు తనకభిన్నమగు తనలోని చిచ్ఛక్తిచేత జగముల నిర్మించి యాజగంబులలో నివసించుచూ చక్రవర్తి తాను సర్వ సమర్థుడయ్యును సామాన్యులగు బంధుజనులతో విలాసార్థముగా నాటలాడుచు స్వబంధువులగుటవల్ల వారిని భేదముగా జూడక వారితో నైకమత్యమున మెలంగుచు నానందించు చుండును. అటువలెనే పరశివుడు సర్వ సమర్థుడయ్యును సర్వజీవులు తనకభిన్నులగుటవలన నాజీవులను వేరుగాజూడకవిలాసార్థముగావారితో గూడియేకమయియుండును: సామాన్యజనులుచక్రవర్తి యొక్కబంధువులున్ను అతనియనుగ్రహపాత్రులున్ను అగుటవలననిర్భయులై చక్రవర్తితమతో గూడియాడి యానందించునటుల తామును చక్రవర్తితో నాడుచు యానందించెదరు. అటులనే అంగసంజ్ఞగల జీవుడు పరశివాభిన్నుడును షట్స్థల జ్ఞానసంపన్నుడగుట వలన పరశివానుగ్రహ పాత్రుడును నై యుండుట వలన ఘటాకాశము మహాకాశమగు నటుల పరశివునితో నైక్యమయి చూచువాడు చూపు జూడబడువాడునను నదిలేక యేకమై నిత్యసత్యజ్ఞాన ప్రకాశానంద స్వరూపమయి మహాలింగమై యున్నస్థితియే అయిక్యస్థలము.

పరశివుని చిత్కళ సహస్రారమున విద్యుల్లేఖవలెనుండు విధమును, అది నేత్రముగుండా బాహ్యమునకువచ్చి యిష్టలింగముమీద ప్రకాశించు విధమును జ్ఞాన హంసలసంచార విధమును, మనసు బ్రహ్మమందు నిలుపు నపుడు జీవునకు బ్రహ్మత్వసిద్ధి కలుగు విధమును గురువు శిష్యునకు దృష్టాంతముగా క్రియచేత చేసి బోధపడునటుల చూపవలసి యున్నదిగాని వ్రాయుటకు సాధ్యముకాదు ప్రాణలింగ స్థలమున, నేక కాలమునం జేయూర్ధ్వాధోభాగ వ్యాపారము కలిగియుండును ఇదియును గురువు చూపించవలసి యున్నది కాని వ్రాయనలవి కాదు

ఇట్లు, చదువుల బసవశంకరయ్య, పిఠాపురం.

శ్రీశివాయనమః

# శ్రీ లింగమణిమాలిక.

(ఏలూరు అద్దేపల్లి కుటుంబరాయకవి పరిష్కృతము)

శ్రీశివాంశజుఁడునా ◆ జెన్నమీఁతినచదు । వులనాగయా
ఖ్యుని ◆ కులసతియును । నన్నపూర్ణకళయు ◆ నైనకోటమ్మ న । ద్గర్భ
మనిమెకు పె ◆ ద్దాపురమునఁ । బూర్వసంచిత మను ◆ భూమిమీఁదఁ
నుమాంస । మనెడు మట్టిని ర క్త ◆ మనుజలమును।గలిపి గోడలుపెట్టి ◆
ఘనమగు నెముకల గొన్ని స్తంభాలుగఁ ◆ గొన్ని యడ్డు । దూలంబు
లుగ నేట ◆ వాలుగనుండెడు । పక్కటెముకలను ◆ వాసములుగఁ ।
దల పెంకు నింటికిఁ ◆ దగినపైకప్పుగఁ । జర్మము న్వెల్లగఁ । జక్షువు
లను । సురుచిరమగు వెలు ◆ తురుకిటి కీలుగాఁ । జేతులం జెవులను ◆
జిలుకకొయ్య।లుగ నాసికమును గా ◆ లిగవాతమునుగాఁగఁ।బొట్టను
సరకుల ◆ కొట్టుగాఁగఁ । బాయురిందియమును ◆ బాయుఖానాదొడ్డి।
గాఁగ గుహ్యంబును ◆ గలుమయుక్త । మైన జలము పోవు ◆ సట్టి
తూముంగాఁగఁ । బాదయుగమును బు ◆ నాదిగాఁగ । నోరునుముఖ్య
మా ◆ ద్వారంబుగా నూరు । వులను గూర్చుండెడు ◆ స్థలముగాఁగఁ।
బెదవులన్ దలువులు ◆ హృదయము న్వెలగల । సరుకులదాఁచెడు ◆
స్థలముగాఁగఁ । జఠరాగ్ని యుండెడు ◆ చక్కనినాభిని । వంటశాలగ
మటి ◆ భవ్యమైన । పరమ జిహ్వను నీళ్ళ ◆ బావిగఁ ద్రిపుటిస్థ।లంబె
యాఫీసు స్థ ◆ లంబుగాఁగఁ । బరగసహస్రార ◆ పద్మమె శయనస్థ
లంబుగ బ్రహ్మరం ◆ ధ్రమును నిగమ । వినుతుఁడా చిలువ్రారి ◆ వీర
బసవ గురు । దేవుని గదిగాఁగ ◆ దేహమనెడు॥ గీ॥ భవనమును బొంది
యందుండి ◆ భక్తినిగురు । దేవు ననిశము బూజించు ◆ జీవుఁడనెడు
భక్తజనహిత చదువుల ◆ బసవశంక । రయ్యనాముఁడ ననువిన ◆ ర
య్యబుధులు॥

సీ॥ శ్రీగురుఁడొసఁగిన ◆ లింగేక్షణంబును।సల్పుచుండగనొక ◆
సమయమందు । నాలింగ గర్భము ◆ నందున్న శివపుర।

వాసులుచేసెడు ♦ పనులఁజూచి తనివినిబొందున ♦ న్గనఁగొని వారల। పె
నులరీతినిపర ♦ బ్రిహ్మవిద్య। నభ్యాసమును జేయు ♦ నట్టిశ్రీసద్భక్త। వ
రుల కుపకరించు ♦ సరణి సీస। పద్యములజేయ మనుచు నా ♦ పరమ
లింగ। మూర్తి ప్రత్యక్షమై జెప్ప ♦ ముదముఁజెంది। సీసపద్యముల
నఁగొన్ని ♦ చేసి లింగ। మూర్తి కర్పణఁజేసితి ♦ బుధులుమెచ్చ॥

సీ॥ శ్రీగురులింగ! నా ♦ చిత్తమందొకనాఁడు। నినునిల్పిపూజించి ♦
నిరుపమానమగు నీదురూపము ♦ న్దగఁ జూచుచుండ నీ। పరమోదరము
లోన ♦ వఱలుచున్న। శివపురవాసులు ♦ జేయు పనులగని। చోద్య
మందెడు నను ♦ జూచివారి। పనులరీతిని దగ ♦ బ్రహ్మ విద్యాభ్యాస
ములను జేయుమటంచును ♦ చె। పరుల కుపకరించు ♦ సరణి పద్య। గీ॥
లువుమిగుల నీవు బ్రత్యక్షమైయాజ్ఞ ♦ నీయ సీస। పద్య మణిమాలి
కఁ జేసి ♦ పరగనీకు। చిత్త మలరగ నర్పింతు ♦ సిద్ధలింగ॥

## జంగమయ్య.

సీ॥ బ్రహ్మాండమంతయు ♦ భవ్యదేహముగ నీ। శ్వరుని జీవుని
గాగ ♦ పరమలింగ। ధారణమునులోక ♦ తన్నీకజీవుల। నైక్యంబుగా
జేయు ♦ నట్టిపనిగ। శివపూజనమును ద ♦ త్త్వవిచారణముగాగ। లిం
గేక్షణంబునభం ♦ గవృత్తి। మనసును బ్రహ్మమం ♦ దునను నిల్పుట
గాఁగ। దన్మయత్వంబును ♦ దనివిదీర। గీ॥ నిర్వికల్ప సమాధిలో ♦
కలిచినటుల। జంగమయ్యలు దలతురు ♦ సంతసమున। విబుధజనను
త చిలువూరి ♦ వీరబసవ। గురుని చరణము లనిశము గొలిచి లింగ॥

## బ్రాహ్మణుడు

సీ॥ సోమాసియాత్ముడు ♦ సోమిదేవి సుబుద్ధి। యాజ్యంబు సంకల్ప ♦ మ
రయసమిధ। దేహంబు భవ్య వే ♦ దిక వక్షమాయజ్ఞ। పశువహంకా
రంబు ♦ వహ్నితపము। పరమయూపంబు హృ ♦ త్పద్మంబు దర్భలు
వృత్తుల నోమము ♦ ల్వేదముశిఖ। దక్షిణ సర్వమంతయుబ్రహ్మమే
యను। శాంతి బ్రహ్మమనస్సు ♦ సామవేది। గీ॥ ప్రాణనివహంబు

ఋత్విక్కు ♦ వాక్కువవాఙ్ను । లరయ శ్రోత్రముల ధ్వర్యు ♦
డక్షయాగము దీక్షమనసునునిల్పుటదివ్యయజ్ఞ । ఫలము మోక్షంబను
ను విప్ర ♦ వరుఁడు లింగ॥

## క్షత్రియుడు.

సీ. రథముమేనెల్ల సా ♦ రథి బుద్ధిగరహయ ॥ గణమిం
ద్రియములు వ ♦ గ్గంబు మనము । ఇరుసు ప్రాణంబులు ♦ గురుత
రచక్రము ల్విమలధర్మాధర్మ ♦ వితతిబంధ । మరయచిత్తంబు సం చ
రణ భూములతతి । శబ్దాదికమ్ములు ♦ చక్కనిరథి । అభిమానుడగుజీవు
♦ డందమైనధనుస్సు । ప్రణవంబు ఘనమగు ♦ బాణమరయ । గీ॥శు
ద్ధ జీవుండు లక్ష్యంబు ♦ శుభదమైన । బ్రహ్మము పరులుకామలో ♦
భ ప్రమోహ । భయమదాదు లటంచును ♦ బరగఁదలఁచు । మను
జపతి యను జీవుఁడు ♦ మహితలింగ ॥

## వైశ్యుడు.

సీ. అంగడి దేహము ♦ త్సంగ సంజనితుండు । జీవుండు పీఠం
బు ♦ చిత్తశుద్ధి । పరగ గల్లాపెట్టె ♦ భవ్యభ్రూమధ్యంబు । భాసురం
బైనట్టి ♦ త్రాసుమనసు । త్రాసువేకుడకలు ♦ దనరసంకల్ప వి । క
ల్పములు సరుకులు ♦ ఘనతగనెడు । ధర్మంబ ధర్మంబు ♦ త్రాసు
ముల్లు నిలువ । దగిన నెలవుగురి ♦ దానిజూచు । గీ. చూపు మో
క్షాశ దివ్యంబు ♦ చోద్యమైన । బ్రహ్మమగు లింగమంచును ♦ బ
రగమదిని । దలచి మోక్షధనంబును ♦ తనివిదీర । నార్జనముజేయు వ
ర్తకుఁ ♦ డమృతలింగ ॥

## శూద్రుఁడు—కాపు

సీ. మేననియెడు భూమి ♦ మీదిదుర్గుణముల । నొప్పదల సమితి
ని, సద్బుద్ధియనెడు । కత్తిచే ఖండించి ♦ ఘనగురుబోధను । నాగలి
గాఁజేసి ♦ యోగుబాగు । లనెడు యెద్దులగట్టి ♦ పనిగొని బ్రహ్మవి

చారణమను దుక్కి ♦ చక్కదున్ని । జ్ఞానమన్విత్తులు ♦ జల్లి సజ్జనసే వ । నానీరుఁబోసి సుజ్ఞానమనెడు గీ॥ మొక్కలను బెంచి వానిని ♦ గ్రుక్క జేయు । మాయయనఁబడు కలుషను ♦ బాయ జేసి తనరబ్రహ్మప దంబను ♦ ధాన్యములను జీవుఁడనుకాపువండించు ♦ సిద్ధలింగ॥

## విశ్వబ్రాహ్మణుడు.

సీ॥ తనువనెడు దుకాణ ♦ మునహృదయంబను । కుంపటిలోపల కోపచిత్త । మనెడునూఁకనుబోసి ♦ యవగుణంబులనెడుబొగ్గులనునుని చి ♦ పొలువుమిగుల । బ్రహ్మంబునాఁబడు ♦ పసిడిగల్గిననహ । స్రార మన్మానను ♦ జక్కనుంచి । జ్ఞానమన్వహ్నిని ♦ నంధించి గురుబోధ యనెడుగొట్టము బట్టి ♦ యద్భుతముగ । జక్కనిబ్రహ్మ వి ♦ చారణ యను నూదు నూఁదుచు మిక్కిలి ♦ మోదమంద । బ్రహ్మమిట్టిదియ ♦ బాగుగాదెలియుట । యనుకలుగుదలను ♦ నతిరయమున । గను గొని పరమాత్మ ♦ యననొప్పు కడ్డీని జాగరూకతతోడ ♦ నంతరించి సగుణ రూపంబను ♦ సొగసుపట్టెడనుంచి । శుద్ధమనంబను ♦ సుత్తిచే త గీ॥ మనసునిల్పుటయను దెబ్బఁ ♦ దనరఁగొట్టి । జీవుడనియెడు టం కంబు ♦ చెంతఁజేర్చి । యద్భుతానందమనియెడు ♦ నతుకు నతికి । గనఁబడులను నగన్విశ్వకర్మలింగ ॥

## గొల్ల

సీ॥ ధర్మాదికములుపా ♦ దంబులు గల్గిన । ధేనువు దేహంబు దానియెడను । గట్టఁబడిన కన్నె ♦ ఘనముముముక్షుత్వాశ । కట్టురాట గురువు ♦ గారిపదము । మేతశ్రీగురుబోధ ♦ మేలైన బంధంబుసజ్జనస హవాస ♦ సంయుతంబుకుండ శుద్ధమనస్సు ♦ దండి పాలపొదుగు । భ వ్యసహస్రార ♦ పంకజంబు । గీ॥ చక్కఁబిండుట బ్రహ్మవి చారణంబు పరగఁ బితికెడు వేళ్ళు స ♦ ద్భక్తిశ్రవణ । మననములుపాలుసద్బ్ర హ్మ ♦ మనసుశుద్ధి । జీవుడను గొల్లకులజుడు ♦ సిద్ధలింగ.

# షరాబు.

సీ॥ అంగంబునాఁ బడు ♦ నంగడిలో హృద । యంబని మెఱపె
ట్టె ♦ యందునుండు వైరాగ్యగరిమ నాఁ ♦ బకు డబ్బుచేతను । మలి
నజీవుండను ♦ కలుషయుక్త । మగుపసిఁడిని గొని ♦ తగగురుసద్బోధ।
మనిమెఱు రాతిపై ♦ ఘనతమీఱ । జక్కని తత్త్వవి ♦ చారణమను
గీఁటు నునిచి నిర్మలజీవు ♦ డనేఁడు మచ్చు। బంగారుగీఁటు చే ♦ వడి
గదానిగుణము । నిట్టిదియని మది ♦ నెఱిగిపిదప । సప్తాంగయోగము♦
లభ్యసించుట యను । పుటములోసడి తీసి ♦ పొలుపుమిగుల । బ్రహ్మ
స్వరూపమై ♦ వఱలెడుమేలిమి । బంగారమును జేసి ♦ పరగదాని।భవ్య
సహస్రార ♦ పద్మంబునాఁబడు సంచిలోపలనుంచి ♦ యంచితముగ గీ॥
బ్రహ్మలీలావినోద మవ్వర్తకమును । జేయుచుండును నచ్చట ♦ చిన్న
నాఁట । నుండి గురుసేవఁజేయుచు ♦ నుండుకతన । సరగజీవుండను ష
రాబు ♦ పరమలింగ॥

# శెట్టికులజుఁడు.

సీ॥ తాళదుర్గిమము మేను ♦ దాని చివర భాగ। మలసహస్రార
క ♦ మలము మంచినిచ్చెన యుచ్ఛ్వాస ♦ నిశ్వాసములు చెట్టు । మీ
దకు నెక్కుట ♦మీఁదిమావు । గొలల సమూహంబు ♦ కలుషగుణంబు
లు । కత్తిసుజ్ఞానంబు ♦ కడఁగిగొలల । బాగుగాఁగీయుట ♦ బ్రహ్మ వి
చారణ । కుండను గట్టుట ♦ గొప్పజపము॥ గీ॥ కుండ గురుబోధబడసిన
♦ గొప్పమనసు । కల్లు బ్రహ్మంబు త్రాగుట ♦ ఘనతమీర । నను
భవముమత్తుతన్మయం ♦ బనుచుదలఁచు । జీవుడను శెట్టికులజుండు ♦ సి
ద్ధలింగ॥

# దొమ్మరివాఁడు

సీ॥ దొమ్మరిజీవుండు ♦ దొమ్మరిడోలనా। హతచక్ర మాటాడు♦
నట్టిచోటు । దేహంబుమిక్కిలి ♦ దిట్టమౌ నాడోలు । వాయిద్య
మద్భుత ♦ ప్రణవరవము । పరగ దొమ్మరిగడ ♦ బ్రహ్మదండి యొ

ముక । గడతుది భాగంబు ♦ ఘనతమీాటి । బ్రిహ్మరంధ్రిము గడ ♦ స్బడకుండ నాపెడు । తాిళ్ళు సుషుమ్నాది ♦ నాళ్ళవితతి । చక్కని దొమ్మరి ♦ సానిశుద్ధ మనస్సు । సరగనాదొమ్మరి ♦ సానినిగడ।మీాది భాగమునకు ♦ మిక్కిలి మెలకువ । మీాద నెక్కించుట ♦ మీాది చూపు । చక్కగ దొమ్మరి ♦ సాని నాడించుట । సానంద తత్వ వి♦ చారణంబు । నాటనాడి పిదప ♦ నమితహా ధనము సం । పాదనఁ జేయుట ♦ బ్రిహ్మపదము॥ గీ॥ గాఁగసతతము మదిలోన♦గారవమున । దలఁచుచుండును దొమ్మరి ♦ తనివిదీర । గురునిపదముల ననిశము ♦ గొలుచుకతన శ్రీకరాకార శుభకర ♦ సిద్ధలింగ॥

# దేవ తేలి

సీ॥ దేహంబునాఁబడు ♦ దివ్యమైనటువంటి । గానుగసాలలో ♦ ఘనతమీాటఁ । బ్రికృతిస్వరూపమై ♦ పరగుగానుగఁబోట । పురుషుడ నోికలి ♦ పొనగ నునిచి పనిగొని జన్మము ♦ లను నువ్వులనుబోసి । బ్రిహ్మోపదేశ మ ♦ న్బగ్గమునను । మానసంబనిమెడు ♦ మంచి యె ద్దునుగట్టి । సతతంబు తత్వ వి ♦ చారణమను । గీ॥ ఆఁటనాఁడుఁచు గైవల్య ♦ మనెడు తైల । మును ముదంబున బొందును దనివిదీర । జీవు డనియెడు తిలఘాతి ♦ భావమలర।గురునిపదబోధముం జెంది ♦పరమలింగ

# కుట్టుపనివాడు

సీ॥ భ్రాంతియనంబడు ♦ పదునుగల్గిన మాయ । యనెడు కత్తెరచేత ♦ నద్భుతముగఁ । గత్తిరింపఁబడిన ♦ కటునీచమైనలో । కములను గుడ్డ ము క్కలనమితిని । గనిజీవుఁడను కుట్టు ♦ పనివాడు వ రదేహ । మనెడు మిషనుమీాద ♦ ఘనతమీాఱ । సుజ్ఞాన మనియెడు ♦ సూదిలోడను మన । స్సను దారమునుగూర్చి ♦ తనవిదీర । గీ॥ సంతతం బును బ్రిహ్మ వి ♦ చారణయను । గుట్టునుంగుట్టి శృితులిట్లు♦ ఘోషి లునని । ఏకమేవా ద్వితీయమం ♦ చెలమితోడ । బ్రిహ్మమగు గుడ్డ చొకాఁను ♦ బడయులింగ॥

# మంగలి

సీ॥ క్షురకుండు జీవుండు ♦ కురులుదుర్గుణములు । కత్తినుజ్ఞానం
బు ♦ ఘనతమీాఱ। క్షౌరంబు దుర్గుణసమితిని దున్మించుట । యద్దంబు
గురుబోధ ♦ యందమైన యవయవంబుల నద్ద ♦ మందునఁగాంచుట
తనదు స్వరూప దర్శనముపిదప । తన రూపమును గనం ♦ గొని
తృప్తిజెందుట । లింగాంగసమరస ♦ లీలగృహము॥ గీ॥ కాయముగ
క్షౌరమును జేయు ♦ కాలమందు । బుద్ధిచాంచల్యమింతయుఁ ♦ బొర
యకుండ । లింగతత్త్వ విచారణ ♦ రంగుమీాఱఁ । జేయుచుండును మం
గలి ♦ సిద్ధలింగ॥

# చాకలి.

సీ॥ చాకిజీవుండు వ ♦ స్త్రంబులు తనువులు । మాలిన్య వితతి
తిర్రి ♦ మలములరయ । సలిలంబు ప్రణవ పంచాక్షరియుతి కెడు। బండన
ద్గురుపాద ♦ పద్మయుగము । బట్టలనుదుకుట ♦ బ్రహ్మవిచారణ । ర
జకునిమాల్గుట ♦ ప్రణవరవము । ఆరవేయుట యింద్రి ♦ యముల
జయించుట । లెవరిబట్టలు వారి ♦ కిచ్చుటెల్ల । గీ॥ పంచభూతల
యంబుఁగ ♦ బరగుచుండ । తానుమిగులుట బ్రహ్మంబు ♦ తానెయగు
ట । మనమునందున దలపోయు ♦ చనవరతము । బట్టలుదుకును చాక
లి ♦ పరమలింగ ॥

# వైద్యుడు రోగి

సీ॥ మలినజీవుడు రోగి ♦ మదమాదిదుర్గుణ । జాలంబురోగ
పుం ♦ జంబుగాఁగ ॥ నిర్మలజీవుండు ♦ నిజభిషగ్వరుఁడుగా । జ్ఞానోపదే
శమా ♦ షధముగాఁగ । సజ్జనసేవక ♦ సాయంబుగాఁదత్త్వ । భావన
మాషధసేవగాఁగ । వైరాగ్య మార్గంబు ♦ పథ్యంబుగా మోక్ష । ప
దమె యారోగ్యంపు ♦ బదముగాఁగ॥ గీ॥ దేహగేహంబులందున ♦ దేజ
రిల్లు । జీవులనియెడు రోగులు ♦ చిత్తములను । ధలఁచుచుందురు సతతం
బు ♦ తనివిదీర । శ్రీశుకరుణాతిశయమును ♦ జెందిలింగ॥

## పల్లెకులజుఁడు

సీ॥ ప్రకటదేహంబు ♦ లోకంబుగానహా।సా్రిరవద్మము సము♦ ద్రింబుగాఁగ । శ్రీవరబ్రహ్మంబు ♦ చేవలనమితిగ । భవ్యజీవుఁడు పల్లె ♦ వాఁడు గాఁగ । బ్రిణవయుక్తంబగు ♦ పంచాక్షరంబులు । మేలైన వలనల్లు ♦ నూలుగాఁగ । గురుఁడుబోధించిన ♦ వరమంత్రి రాజంబు । చతురతతోనల్లు ♦ జాలకముగ । గీ॥ విమలతత్త్వవిచారణ వేటఁగాఁగ । బ్రహ్మమందుట మీలను ♦ బడయుటగను । జీవుడను పల్లెకులజుండు ♦ చింతజేయు । శ్రీగురువరుని సద్బోధఁ ♦ జెంది లింగ॥

## కుమ్మరి

సీ॥ చింతలచేఁగుండు ♦ జీవులుకుమ్మరుల్ ప్రారబ్ధనామక ♦ ర్మమ్ముమృత్తు। లలినీశ్వరాజ్ఞమె సలిలమ్ము వరకాలచక్రింబుకుమ్మరి ♦ సారదేహ । ములుపచ్చి కుండలు ♦ సలలితగురుబోధ । యావంబు సుజ్ఞాన ♦ మనలచయము । బ్రహ్మవిచారణ ♦ పరగనా వపుఁగాల్పు । బ్రహ్మంబుకాలిన ♦ భాండసమితి । గీ॥ గాగఁదలచుచునుందురు ♦ ఘనతమీఱ । జీవులనియెడు కుమ్మర్లు ♦ చిత్తములను । గురునిపదముల ననిశము ♦ గొలుచుకతన శ్రీకరాకారశంకర ♦ సిద్ధలింగ॥

## దేవాంగి.

సీ॥ పరమేశ్వరుండను ♦ పకుగునూలును దెచ్చి । ధ్యానస్వరూపమై ♦ దనరునట్టి । యానుగొట్టంబున ♦ భాసురమంత్రి రూ । పమున జెలంగెడు ♦ పడుగువిసరి । జపమనుగంజిలో సరగఁబదును జేసి । ఘనతరశ్రవణాదు ♦ లనెడికుంచి । తోడనుసరిజేసి ♦ వేడుకతో దాను । తానోకటనునచ్చు ♦ దనరనతికి । వరస మాధియనగ ♦ పఱలు మగ్గపుగొయ్యి । త్రివిధదేహంబన ♦ దనరునట్టి♦మగ్గంబునందున ♦ మర్చిజీవుండను పేకనూలునుదెచ్చి ♦ పేర్మిమీఱ ।శుద్ధజీవుండను ♦ సొగసగుకండెలు। జుట్టిగుతినిజూచు ♦ చూపనఁబడు । నాడితోడనుగూర్చి ♦ వేడుకతో గుతిన్ । జూచుటయనియెడు ♦ చోద్యమైన । గీ॥ నేతనేయుచుమిక్కిలి

నేర్పుతోడ । మనసునాఁబడు పలకతో ◆ మనసునిల్పు । టనెడు ధట్టింపుధట్టించి◆దనరబ్రహ్మ।మనెడువస్త్రముబడయు దేవాంగిలింగ॥

కటికవాడు.

సీ॥ అంగంబునాఁబడు ◆ నంగడిలోనహం । కారమనియెడుమృగమును బట్టి । జ్ఞానమన్గత్తిచే ◆ జక్కఁ ఖండించిమా । యావరణంబను ◆ నట్టిచర్మ । మునునొల్చివైచి క ◆ తినగుణంబులనెడు । నస్థులన్దొలఁగించి ◆ యపుడుబ్రహ్మ । మనియెడుమాంసము ◆ న్దనర సజ్జనసేవ । యనుశుక్కపైనిడి ◆ యమితతత్త్వ।గీ॥ చింతనంబనుముక్కలు ◆ జేసి తృప్తి । గాంచియుండుటయను సమ్మతమున జీవుఁ । డను కటికవాడు గడియించు ◆ దనివిదీర । మోక్షమనియెడు ధనమును◆ముక్తిలింగ॥

భోగపుమేళము.

సీ॥ ఆత్మయంచుయజమాని ◆ యధిదైవతంబులు । సభికులింద్రియములు ◆ సానులతతి । మనసుమద్దెలకాడు ◆ ఘనుడగుహంసుడు । తెలివితేటలుగల ◆ తిత్తిగాడు । గుర్వనాహతచక్రి ◆ గురుఁడు తాళముచేత । దనరఁగా లయఁజూపు◆ తాళగాఁడు । బుద్ధిచిత్తంబులు ◆ ముద్దుగుల్క పిడేల్లు । వాయించిపాడెడు ◆ పాటగాండ్రు । గీ॥ మేనుభోగపుసానులు ◆ మేళమాడు। చోటుతత్త్వవిచారణ◆ యాటముక్తి। పదముగడియింపబడిన ద్ర ◆ వ్యంబుగాఁగ । జీవులను భోగకులజులెం ◆ చెదరులింగ॥

పాములవాడు.

సీ॥ దేహంబునాఁబడు ◆ గేహంబులోపలఁ । జక్కనియాధార◆ చక్రమనెడు । పెట్టెలోనఁబరుండి ◆ విషయవాసనలకు! బోవుటయనునిద్ర ◆ పోవుచున్న । మనసనియెడు సర్ప ◆ మును సుషుమ్నయనెడు । నాగస్వరముబట్టి ◆ బాగుమీర । నూర్ధ్వదృష్టియనెడు◆ నూఁదునూఁదు చులేపి । బ్రహ్మరంధ్రంబను ◆ బయలుమీఁద । గీ॥ బ్రహ్మలీలా వినోదమ ◆ న్బడెడు నాఁట । జక్కనాడించి యుచటమోక్షంబనియెడు । ధనమునార్జించుచుండును◆దనరజీవు।డనెడు పాములవాఁడను ◆ దినములింగ॥

వాచిమేకరు.

సీ॥ భవ్యజీవుండను ◆ వాచిమేకరు దేహ । మనుగడియారమున్ దనరఁబట్టి। జ్ఞానమన్గత్తిచే◆చక్కనితత్త్వవిచారణమను త్రిప్పు◆సరగఁ గ్రిప్పి

మనసనిరెండు ముల్లు ♦ దనరలక్ష్యంబను । సంఖ్యనందీన వుడు ♦ సంతసమునఁ । బ్రణవనాదంబునాఁ ♦ బడుఘంటలరవంబు ।వి నిరయమున బ్రహ్మ ♦ మనెడుప్రైము । గీ॥ నెఱిగిసరగుననిరతంబు ♦సు రుచిరముగ। బ్రహ్మలీలా వినోదమ ♦ న్బడెడుపనుల । నాచరింపుచు నుండున ♦ త్యద్భుతముగ ! జీవుఁడను వాచిమేకదు ♦ సిద్ధలింగ ॥

తోట మాలి.

సీ॥ చక్కనితనువు వృ ♦ క్షంబు ప్రకృతిపాదు మూఁడుగుణం బులు ♦ నాడులతతి । కష్టసుఖంబులు ♦ ఘనమగు ఫలములు ।ధర్మా ర్థముఖరముల్ ♦ తగుగసమ్మ । లింద్రియసముదయ ♦ మెఱ్ఱిగెడి విధములు ।ధాతువుల్ల్పొరలు భూ ♦ తంబులైదు । ప్రంగలు ప్రాణా లు ♦ పత్రిపితతినవ । రంధ్రంబులెల్లలో ♦ జ్జలనిచయము । గీ॥ భవ్య జీవేశులచ్చటి♦ పక్షియుగము ।బ్రహ్మమువనంబుగాగను♦బరగదలఁచు జీవుఁడనుతోటకాపరి♦చిత్తమునను।గురునిపదములునిరతముగొలిచిలింగ

వ్రాత వ్రాయు చిన్న వాడు.

సీ॥ దేహంబునాఁబడు ♦ గేహంబులోనుండు । జీవుఁడనంబడు చిన్నవాఁడు । సద్భక్తియనెడు హ ♦ స్తముచేతబట్టిన । జ్ఞానమన్ కల ములో ♦ సంతసమున। భవ్యసహస్రార ♦ పద్మమనెడు బుడ్డి । యందు నుండెడు బ్రహ్మ ♦ మనుసిరాను । సంగ్రహణముజేసి ♦ చక్కనిభ్రూ మధ్య । మనెడు కాగితముపై ♦ ననుదినంబు । గీ॥ బ్రహ్మవేదిత్వ మని యెడు ♦ వ్రాతవ్రాసి । డెందమందున సంత తా ♦ నందమనెడు । మారుక్కలగడించు చుండును ♦ మానితముగ । గురునిపదముల నిరత ము ♦ గొలిచిలింగ పడవనడుపు వాడు

సీ॥ కాయంబు భూమి శ్రీ ♦ కర సుషుమ్నమునది। మనసు చక్కనిబోటు ఘనతమీఱ । జ్ఞానంబుకొయ్యని ♦ శ్చలబుద్ధి తెఱ చాప ॥ మంచి చిత్తంబు డ ♦ మానుతాడు । పంచేంద్రియంబులు ♦ భటన్రైసగడులు। మోహాదిగుణములు ♦ మూటలతతి । శబ్దాదివిషయ పం ♦ చకము పాంథులతతి । యఃల ప్రాణములు కళా ♦ సులనిచయ మః । శ్రవణాదులు గడలు ♦ సాధుసంగతి తెడ్లు । ధైర్యంబు లంగ రు ♦ దైవభక్తి । తఁడేలు మోక్షము ♦ తాడు సహస్రార । చక్రం

బ మొగుమతీ ♦ సరకులవు । చుక్కసయాధార ♦ చకరింబు దిగుమతీ లేవు శ్రీగురుఁడు వి ♦ లేఖరియగు । కుగుణ సముదయంబు ♦ దిగుమ తి సరకులు । సంతసం బెగుమతీ ♦ సరకులతతి॥ గీ॥ గాఁగ నియమించి యచ్చట ♦ గరిమమీఱ । జూపు చుక్కాసిబట్టుచు ♦ శుద్ధజీవు । డ న్నిమెడు సరంగు బోటును ♦ దనరసడిపి । మోక్షఘనమును గడియిం చు ♦ ముక్తిలింగ ॥

ధాన్యమును దంపెడుస్త్రీ

సీ॥ పూర్వజన్మములను ♦ మొలకలబండిన । సంచితమను ధాన్య మంచితముగ । బుద్ధియనెడుఱోట ♦ బొలుపొందఁగాబోసి । ఘనగురు బోధ ఱో ♦ కలిగఁజేసి । తత్వభావనమను ♦ దంపు దంచునపుడు । చె డుగుణంబు ♦ లనెడు చెదరినట్టి । ధాన్యపుగింజలు ♦ తనరఁగాఁగాలితో। బోగుచేయుచును సద్బుద్ధియందుఁ । గీ॥ జన్మయానందమను నీరు♦జలికి పిదప । నావరణమనునట్టి పొ ♦ ల్లణఁగదొక్కి । బ్రహ్మమను బియ్య ము బడయుఁ ♦ బరగఁజీవుఁ । డనెడు చేడియ దేహ గేహమునలింగ

వంట.

సీ॥ త్రిపుటిస్థలము పొయ్యి ♦ చపలగుణంబులు । కట్టెలుగాఁ గను ♦ ఘనతమీఱ । జ్ఞానంబువహ్నిగా ♦ సద్గురు బోధయే । వీవన గాఁ దత్వ ♦ భావనమ్ము । విసరుచుండుటగాఁగ♦ వేయిదళంబుల । క మలంబు భాండంబు ♦ గాఁగఁదనర । జీవుఁడునీరుగా ♦ శ్రీశుడు బియ్య ము । గా బ్రహ్మమన్నము ♦ గాఁగమదిని । గీ॥ గురుని పదముల నని శము ♦గొలుచుకతన । దేహగేహమునందున ♦ దివ్యముగను । వంట జేసెడు వేళను ♦ బరగదలఁచు। జీవుడఁనియెడు చేడియ ♦ సిద్ధలింగ ॥

బావి నీరు తోడు చేడియ

సీ॥ బావియుండెడుచోటు ♦ భవ్యశరీరంబు । బావిసహస్రార ♦ పంకజంబు । నీళ్ళుచేదెడుపాత్రి ♦ నిర్మలచిత్తంబు । కుండకుగట్టిన ♦దం డిమోకు।ప్రణవపంచాక్షరి ♦బాగుగనీటిని। బైకిచేఁదుటతత్వ♦భావనంబు చేడియనిర్మల ♦ జీవుండునీరము। పరశివతత్వమహా♦బ్రహ్మపదము।గీ॥ నీరు త్రాగుట వేదాంత♦సారమైన।బట్టబయలగుబ్రహ్మను♦భవముగాఁగ♦గురు వరునిదొక్కపదపద్మ♦కరుణవలన।నీరుదోడుచు దలపోయు నెలతలింగ।

## దీపమును వెలిగించి నగలనుధరించు స్త్రీ

సీ॥ చక్కనితనువను ♦ సదనంబునందు హృ । త్పద్మంబునా బడు
ప్రమిదలోన । బలిగొనిసంచిత ♦ మనుచమురును బోసి । మనసనువత్తిని ♦ దసర
వేసి । జ్ఞానాగ్ని చేతను ♦ జక్కగ వెలిగించి । యజ్ఞానతిమిరము ♦ నణచివేసి । శృంగా
రమైనట్టి ♦ శృంగాటకంబను । గదిలోన బ్రహ్మమున్ ♦ గాంచనంపు । గీ॥ నగలనా
నంద ధారణమగణితముగ । జేసికొనుచుండు నెప్పుడు ♦ చిత్తమలర । సత్వగుణ
మను చీరను ♦ చక్కగట్టి । ఘనత జెందిన వరజీవ ♦ కాంతలింగ ।

## హై స్కూలు

సీ॥ హైస్కూలు దేహంబ ♦ యందలి ఫారముల్ । షట్చక్రి
ములు శిష్య ♦ సముదయంబు । బ్రహ్మవిష్ణ్వాదులు ♦ ప్రాజ్ఞులు మే
ష్టర్లు । శ్రీకరాచారాది ♦ లింగవితతి । ప్రిన్సిపాలాత్మయడా ♦ ఫీసుసహ
స్రార । పద్మంబు సద్బోధ ♦ బ్రహ్మవిద్య । పాఠాలవల్లింపు ♦ బ్రహ్మ
విచారణ । ఆటాడుచోటు శృం * గాటకంబు గీ॥ అమితపుస్తక రాజి
ల * త్ప్యంబు ప్యాసు । గాంచుపెల్లను ముక్తిని * గాంచుటంచు । దలం
చుచుండెడు బాలక * తండముకడు । వెలయుచుండును వేడ్కతో * విశ్వలింగ

## కోర్టు మునసబు

సీ॥ దొరతనమాత్మ సుం ♦ దరమగు కోర్టు దే ! హంబు సింహా
సన ♦ మతివిచిత్రి । మైనసహస్రార మధికార మాయాత్మ । శక్తిశ్రీ
మునసబు ♦ జ్ఞాతిక్లర్కు్స । అంతరింద్రియసమూ ♦ హంబమీనాలుబం
ట్రితులు బాహ్యంగ ♦ జాతమరయ । వాదివిరాగుడు ♦ వానిదా
సొత్తుము । ముక్షుత్వమందాశ ♦ కక్షిదారు । డజ్ఞాని ప్లీడరు ♦ ప్రాజ్ఞుడై
న గురుండ । తనిసలహా సుబోధము ప్లయింటు । మోక్షమందుండునా
పేక్షను దెలిపెడు । సద్భక్తియుత దైవ సన్నుతంబు । కేసు విచారణ ♦
ఘనురంబైనట్టి । మోక్షప్రయత్నము ♦ సాక్షులతతి । ఎటుకమటపులజీ ♦ ము
జితీర్పు జీవేశ్వ । రైక్యంబనెడు బ్రహ్మ ♦ మందు జేరు । గీ॥ కొనుట కధికారమం
చున ♦ తనివిదీర । జీవులని యెడు పార్టీలు ♦ చిత్తములను । దలంచుచుందురు నిర
తంబు ♦ కలుష మెడలి । గురుని పదముల విడువక ♦ గొలిచి లింగ ॥

## మేజస్ట్రీటుకోర్టు—దొంగలు—ఫిర్యాది

సీ॥ భవ్యదేహంబను ♦ భవనంబులోని హృ । త్పద్మ పేటికయం

దు ♦ దాఁచియున్న । జ్ఞానంబునాఁ బడు ♦ చక్కని రత్నము । న్గొని పోమె నెవ్వడో ♦ యనుచునేడ్వ । సద్గుణంబు లనెడు ♦ చక్కనిపోలీసు బంటులు ధర్మమ ♦ న్బడెడు హేడ్డు । పరమసద్భక్తినాఁ ♦ బడు సినస్పెక్టరు । లాదిగాఁగల ♦ వారలంతగూడి । కామాదులనెడుదొంగలనుపఞ్ఞవమంత్రి । మనెడు సంకిలిచేతఁ ♦ దనరగట్టి । శ్రీగురుఁడను మెజ♦స్ట్రీటు ముందర నుంచ । నాతఁడాదొంగల ♦ నద్భుతమగు । జపమను జైలులో ♦ నరగుననుంపించి యచ్చజీవుడను ♦ ఫిర్యాదికపుడె యాత్మనిజ్ఞానమన్న తనిసొత్తు తనికి । నుపదేశరీతిని ♦ నొసరసీయు । గీ॥ బ్రహ్మమని యెడు నగనొండు ♦ బరఁగజేసి । యనుభవంబను ధారణఁ ♦ దనరజేసె । జీవుడనియెడు ఫిర్యాది ♦ చిత్తమలర । గురునిపదముల ననిశముఁ ♦ గొలిచిలింగ ॥

శి వ భ క్తు డు. (ద్వితీయభాగము.)

సీ॥ శ్రీకరమగుపరశివశిలాలింగమున్ హృత్కర పీఠమందె నగనుంచి । దనరనేకాగ్రి చిత్తజలంబు నభిషేక ♦ మునఁజేసి నిర్మల భూతిబూసి । శాంతిగంధమలది సరగున మాయావ ♦ రణరహితాక్షతార్పణము జేసి । మానుగశివపద ధ్యానసుగంధ సం ♦ యుతమనః పుష్ప మర్పితము జేసి । అపరోక్షదృష్టినా । దానుభవములను ధూప ఘంటాధ్వను ల్దొరయఁజేసి । ఘనతర జ్ఞానపకాశ దీపంబిచ్చి ♦ దేహమోహవినాశ దివ్యరూప, నైవేద్య మర్పించి నయముగత్రిగుణరహిత మనుఫీడెంబు నెసఁగనొసగి । జీవేశులకభిన్న భావంబు దెల్పుచు ♦ వరలుచునుండు సువర్ణ మంత్రి । గీ॥ పుష్పమునొసంగి బ్రహ్మైక్యబోధరూప । శరణు జేయుచు పూజించు ♦ సంతసమున । దేహగేహఁబు ♦ నందున దేజరిల్లు । జీవుడను శివభక్తుండు ♦ సిద్ధలింగ ॥

పె రు గు చి లు కు వ ని త .

తనువని యెడుగృహమున విరాగియనెడు వనితమలినజీవుడనెడు పాలు । భక్తియనంబడు పాత్రిలోబోసి సజ్జన సేవయనుకావు జక్కగాచి । బ్రహ్మోపదేశమన్బడెడులోడును బెట్టి మోక్షాశయను త్రాడుముదముతోడ । మననని యెడుకవ్వమునకును గురుపదమనియెడు రాటకుఁ దనరగట్టి గీ॥ తత్త్వభావనమని యెడుదరచుతఱచి । విమలజీవుండునాబడు వెన్నదీసి । జ్ఞానమనియెడునగ్ని చేజక్కగాచి । బ్రహ్మమని యెడు ఘృతమును బడయులింగ॥

పుత్రిని గన్న తండ్రి.

తనువనియెడుగృహమున జీవుడనియెడుమనుజుడు సద్బుద్ధియ నెడుసతినిగూడుచుండుటయనుక్రీడ చేసుపదేశమనెడుగర్భముజేసి యత్రమగుణములకు వేవిళ్లశ్రమలను సజ్జన సేవయనెడుసూడిదలచేనణచివైచి నవచక్రములనెడునవమాసములుదాటనమితయోగాభ్యాసమనెడుబిడ్డ గీ॥ నొప్పులగడుచునప్పుడుగొప్పమీరబ్రహ్మమనుపుత్రినింగాంచిబరమహర్ష జలమునజలకమాడించిజగము మెచ్చ మించియనుభవమనుపాలబెంచులింగ

బొంగరమాటనాడుపిల్లవాడు.

సీ॥ అంగంబు నాబడు నాట స్థలంబున జీవుండు నాబడు చిన్నవాడు। జ్ఞానమన్మొలికిచే జక్కగనుండెడు మనసను బొంగరమునకు మోతు మందాశయను త్రాడునందంబుగాజుట్టి తత్వభావన మనవసరు త్రిప్పు చక్కదిప్పుచు సహస్రారమన్గిరి లోని మాయ బొంగరమును బాయగొట్టి గీ॥ మనసునూర్ధ్వ ముఖంబును దనరజేయు। టనియెడుమొగర వేతను దనరవేసి। బ్రహ్మమున నిల్పుట యనెడుపట్టు బట్టి। అనుభవంబనియెడు జయంబందులింగ ॥

గోలిగుండునాడుచిన్నవాడు.

సీ॥ అంగంబునాబడునాటస్థలంబునజీవుండునాబడు చిన్నవాడు। ఆరు చక్రములను ఆరువత్సరములు గడిచిన బిమ్మట ఘనతమీరు। బ్రహవేత్తలనెడుబాలురగొందరి బ్రేమతోడనుబిల్చి వేడ్కతోడ। నష్టాంగయోగములభ్యసించుటయను నాటనాడుచు మనసనెడిగోలి। గీ॥ గుండునున్ బ్రహ్మరంధ్ర మన్గుంటలోన। జ్ఞానహస్తంబునన్గల్గు చక్కనైన। భక్తినాబడు వ్రేళ్ళతో బరగవేసి। అద్భుతానందమను జయంబందులింగ॥

వడ్రంగి.

సీ॥ తనువనియెడు గృహ ♦ మునవిరాగియనెడు వడ్రంగి సతతంబుబహుళమలిన। జీవుడన్గట్టును జెచ్చెరదెచ్చి సాధనచతుష్టయమనదనరుచుండు। నట్టి రంపమున మాయావరణపొరాటు ♦ చెక్కనుగ్రక్కున జక్కగోసి। వైచి కామ మదలోభ క్రోధమాత్సర్య ♦ మోహంబులను సుల్లుముదముతోడ గీ॥ శ్రవణమనన నదిధ్యాస సాధు సేవ ♦ భక్తిసుజ్ఞాన। ములనెడు బాడిసె యులి దిత్రిగుల్లలతో బాగు। జేసి

బ్రహ్మ • మనెడు విగ్రహమును జేయునమృతలింగ॥

కరణం—పొలముకొలత

సీ॥ తనువనియెడు పొలమున జీవుడని యెడు • కరణమింద్రి యపంచకయుతమనను। నాబడునటువంటి • నాఖర్లతో గూడిగురు బోధమని యెడుగొలుసు చేత। సరగునతత్వ విచారణయనియెడు కొలతనుగొలుచుచుచెలువుమిగుల! షట్చక్రములనెడు చక్కనైనటువంటి చేనుల నేర్పర్చి మానితముగ గీ॥ సరగ భ్రూమధ్యమనగను • బరగుచుండు। చక్కనైనట్టి సర్కారు బుక్కులందు। బ్రహ్మనిష్ఠయనంగ నుబరగు గొలత • లెఖ్ఖలను వ్రాయుచుండునిశ్లేవలింగ॥

ముక్కుపొడినిబీల్చు శాస్త్రిలు.

సీ॥ దేహంబునాబడు గేహంబులో జీవుడనుశాస్త్రి మానసంబనుపొగాకు। నత్యంతవైరాగ్య మనునగ్నిచేగాచి ఘనతరనాసి కాగ్రమనుపాత్ర। మందిడి సద్గోష్ఠి యనెడు నాజ్యాఘును వినయమనునట్టి సున్నమునగూర్చి।జ్ఞానమన్గ్రతో సరగునతత్వవిచారణమనురీతిజక్కనూరి గీ॥ బ్రహ్మమనియెడు పొడుమునుబరగజేసి। యనుభవంబను పీలుపు నమర బీల్చి। చిన్మయానంద మనుఘాటు జేతమోతు।మనుశిరోవాతహరణము గనునులింగ॥

గంజాయి పొగబీల్చుసాధు

సీ॥ దేహంబునాబడు గేహంబులోనుండు జీవుడన్సాధువు శ్రేష్ఠముగను।కలుషమానసమను గంజాయిలోని చంచలగుణమనెడి గింజలసమితిని। దొలగించి పిమ్మట మలపంచకంబను కసను సద్భక్తి యన్గమలమునను। బోగొట్టిదానిని బొందుగభ్రూమధ్యమను జిలుము ననుంచి దనరడాని॥ గీ॥ జ్ఞానమనియెడు నగ్నిచేసంతసమున। తత్వభావనమను గాల్పుదనరగాల్చి। బ్రహ్మమనుపొగనున్ బీల్చిబరమహర్ష। మనెడుమత్తును బొందును దనరలింగ॥

భక్తురాలు (ఊరగాయ)

సీ॥ తనువనియెడుగృహమున జీవియనియెడు చాటాత్రిలక్ష్మన ర్సమ్మవేడ్క। మలినమానసమను మామిడికాయల ఘనగురు బోధయన్గత్తితోడ। చక్కని తత్వవిచారణమనియెడు కోతను గోసి దుర్గుణముల లనెడు।జీడిని మొదలంట మూడభైరికివైచి సత్యవాక్యసద్భక్తిసాధుసేవ ॥గీ॥

జ్ఞానవైరాగ్యములనెడు సూనెకార ।ముప్పునావాల పిండిలోనొప్పునట్టి పెక్కు సంబారములగూర్చి పేర్మిమీర।సారగాయల బెట్టునో యూరలింగ॥

సా లు వ డు కు స్త్రీ.

సీ॥ దేహంబునాబడు గేహంబులోనుండు జీవుడనెడి కాంతశీఘ్రముగను। మానితాష్టదళపద్మమను రాటమునందు మనసనుకదురును ఘనతమీర। జ్ఞానసూత్రముచేత సంధించి సగుణరూప బ్రహ్మమనుప్రత్తి బరగబూని। గురుబోధయను పిడిన్గుదురుగ చేబూని సతతంబు తత్వవిచారణయను। గీ॥ త్రిప్పుదిప్పుచువిడువక దీక్షబూని।నిరుపమాకారనిర్గుణనిష్కళంక। బ్రహ్మమనియెడునూలును వడికి మోక్ష। వస్త్రమునుసేత నేయుంచు వసుధలింగ॥

వై ద్యు డు

సీ॥ తనువనియెడు గృహమునజీవుడ నెడుభిషగ్వర్యుడ లతత్వశాస్త్రము నెడు। వనములోపలిమహావాక్యంబులనియెడుమూలికల్దెచ్చిసద్బుద్ధియనెడు । ఖల్వంబులో వేసిఘన సాధుసాంగత్య మనుకషాయముబోసి యనుదినంబు । పూని సుజ్ఞానమన్పోత్రంబు తోడతత్వ విచారణంబనదనరునట్టి।గీ॥ మర్దనంబునభవరోగమారణంబు । జేయు బ్రహ్మమనౌషమందు జేసిదాని। బ్రహ్మచక్రంబునాబడుబరిణలోన।పదిలముగదాచియుంచును బ్రహ్మలింగ॥

రైలుపై గాశీప్రయాణము విశ్వేశ్వర సందర్శనము.

సీ॥ బ్రహ్మదండియెముక పరగ రైల్వేలైను । చక్రంబులెల్ల స్టేషనులపంక్తి ।అధిదైవతంబులు నందలిమేష్టర్లుశ్వాసటెలిగ్రాము చక్కనైన। జీవుండుడ్రైవరు శీఘ్రకరమగు మనంబింజనింద్రియతతియెల్ల బండ్లు। జ్ఞానంబు స్టీమునిశ్చలబుద్ధి గార్డుశబ్దాదివిషయములుపాంథులతతి॥గీ॥ గాగనుండు రెయిల్ మీద నేగిదివ్య। దేహమను దేశమందున దేజరిల్లు। బ్రహ్మరంధ్రంబునాబడు వారణాసి। జేరిగన బ్రహ్మమనెడు విశ్వేశులింగ॥

శ్రీ శి వా ర్ప ణ మ స్తు.

ఇట్లు,

చదువుల బసవశంకరయ్య,

పెద్దాపురం, గోదావరిజిల్లా.

# నాచే రచియింపబడిన గ్రంథములు.

1. శ్రీ యూశ చరిత్రము. హరికథ.
2. ప్రహ్లాద. ,,
3. కుచేలోపాఖ్యానము. ,,
4. గౌరీకల్యాణము. ,,
5. చోకామేళుని చరిత్రము ,,
6. శివవిష్ణుమయలింగార్చనము.
7. తత్త్వములు.

చిరునామా:—

(వీరశైవుడు) చదువుల బసవశంకరయ్య,

పిఠాపురం, (గోదావరి జిల్లా.)

# శ్రీ పాండురంగస్తవమంజరి.

పద్యకావ్యము.

భక్తిరసము లొల్కు పద్యములు.

రచయిత

అద్దేపల్లి కుటుంబరావు,

ఏలూరు, (పశ్చిమ గోదావరి జిల్లా.)